తెనుఁగు

# లఘువ్యాకరణము

రాజమహేంద్రవరముగవర్న్మెంటుకాలేజి సంస్కృతపండితులు

**శ్రీ వేదము వేంకటరమణశాస్త్రిగారిచే**

విరచితము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచేఁ బ్రకటితము.

1951

*All Rights Reserved.*] [**Price Rs. 1-0-0**

# పద్యకావ్యములు

| | | ప్రతి 1-కి రూ. | అ |
|---|---|---|---|
| నలచరిత్ర, ద్విపద, క్యాలికోబైండు | ... | 2 | 4 |
| నిరంకుశోపాఖ్యానము | ... | 0 | 10 |
| నిర్వచనోత్తరరామాయణము | ... | అచ్చు | |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము | ... | 0 | 12 |
| పల్నాటివీరచరిత్రము | ... | 3 | 8 |
| పంచతంత్రము, నారాయణకవిది | ... | 2 | 0 |
| డిటో వేంకటనాథ రాజకవికృతము | ... | 2 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము | ... | 1 | 12 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు | ... | 1 | 0 |
| „ సాంధ్రటీకాతాత్పర్యము | ... | 3 | 0 |
| మనుచరిత్ర, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద ముద్రితము | | 5 | 0 |
| భాస్కరరామాయణము | ... | 8 | 0 |
| రంగరాయచరిత్రము | ... | 0 | 12 |
| రాఘవపాండవీయము, సటీక | ... | 4 | 0 |
| రాజశేఖరవిలాసము | ... | 0 | 8 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 6 |
| రామరాజీయము | ... | 0 | 12 |
| రామాభ్యుదయము | ... | 2 | 0 |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక | ... | 1 | 8 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద | ... | 1 | 4 |
| విల్హణీయము | ... | 1 | 4 |
| రుక్మిణీకల్యాణము, సటీక | ... | 0 | 10 |
| రుక్మిణీపరిణయము | ... | 0 | 10 |

తెలుఁగు

# లఘువ్యాకరణము

రాజమహేంద్రవరముగవర్న్మెంటుకాలేజి సంస్కృతపండితులు

**వేదము వేంకటరమణశాస్త్రిగారిచే**

విరచితము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచేఁ బ్రకటితము.

All Rights Reserved.

1951

(ORIGINAL TITLE PAGE.)

తెనుఁగు

# లఘు వ్యాకరణము

# TELUGU GRAMMAR

**REVISED AND IMPROVED**

BY

**Vedam VENKATARAMANA SASTRY**

*Formerly* NORMAL-SCHOOL MASTER, NARSAPUR

*AND NOW*

TELUGU PANDIT, GOVT. N. SCHOOL, VIZAGPATAM.

**1856.**

# పీఠిక

ఉత్తరసర్కారుపాఠశాలలయందు క్రిందితరగతులబాలురచే నభ్యసింపఁబడుచుండెడు నరసాపురవ్యాకరణంబను ఆంధ్రవ్యాకరణసంగ్రహంబును తత్కాలమునందు నరసాపురము సబుకలెక్టరుగారైన శ్రీ హెన్రీ మారిసుగారి అనుమతి ననుసరించి ప్రథమశిక్షబాలురకు నలవాటుపడియుండు మాటల తోడ రచియించిన వారికి నీశాస్త్రవిషయంబు సుఖబోధకం బగునని యూహించి ప్రశ్నోత్తరరూపంబుగను వానియందు సంధివిరహితంబుగను గ్రామ్యపదబహుళంబుగను నొక లఘు వ్యాకరణమును ౧౮౭౬-వ సంవత్సరంబున రచియించితిని. అదియె నరసాపురవ్యాకరణం బనఁబరఁగె. ప్రకృతమున ఉత్తర సర్కారుపాఠశాలల ఇన్స్పెక్టరువారగు శ్రీ హెన్రీ బవర్సు గారా గ్రంథమును సమగ్రముగఁ బరిశీలించి నన్ను రావించి ఆగ్రంథమునందుఁ బెక్కుశబ్దదోషంబులు గలిగియున్నవి గావున వానిని దిద్దుపాటుచేసి నాతివిస్తృతకఠినంబుగ నొక్క నవీనగ్రంథమును రచియించునది అని సెలవిచ్చిరి కావున నే నాగ్రంథమును బరిశోధించియు స్వల్పంబుగఁ గొన్నియంశంబు లనుసహితముగూర్చియు నాకుం దోఁచినరీతిని దెనుఁగులఘు వ్యాకరణంబను ఈగ్రంథమును రచియించినాఁడ.

కించిజ్జ్ఞతాజన్యంబులగు దోషంబులు పెక్కులు గానం బడిన విశేషజ్ఞులు వానిని విసివి యుపేక్షింపక కరుణించి సవ రింతురు గావుత!

వేదం వేంకటరమణశాస్త్రి,

విశాఖపట్టణపు నార్మల్ పాఠశాల ఆంధ్రోపాధ్యాయుండు.

# లఘు వ్యాకరణము

తెనుఁగుభాషలో చిన్నయసూరిబాలవ్యాకరణమునకు ముందు వచనరూపమున సూత్రములతో రచితమైన వ్యాకరణములలో లఘువ్యాకరణ మొకటి. దీనిని రచించినవారు బ్రహ్మశ్రీ వేదము వేంకటరమణశాస్త్రులవారు. వీరు సుప్రసిద్ధులగు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారిజనకులు. వీరుమద్రాసు, కాకినాడ, నరసాపురము, పోడూరు, విశాఖపట్టణము, రాజమహేంద్రవరము మున్నగుస్థలములలో సంస్కృతపండితులుగ ప్రధానోపాధ్యాయులుగ నుండి అప్రతిగ్రాహకులగు సత్యసంధులనియు పేరెక్కినపుణ్యమూర్తులు. వీరిజీవితకాలము క్రీ. శ॥ 1817 నుండి క్రీ. శ॥ 1900 వఱకు నెనుబదిమూడేండ్లు.

పీఠికలో వేంకటరమణశాస్త్రులవారి వ్యాకరణము తొలుత నరసాపుర వ్యాకరణమను పేర క్రీ. శ॥ 1856 రచింపంబడినదని వ్రాయుటచే నిది క్రీ. శ॥ 1858 సంవత్సరమున తొలుత ముద్రితమైన చిన్నయసూరిబాలవ్యాకరణముకంటె రెండేండ్లు ముందుగ వెలువడినదనుట నిర్వివాదాంశము. ఈవ్యాకరణమును బాలవ్యాకరణముతో సరిపోల్చిన శ్రీసూరి ఈవ్యాకరణములోనివిషయములను గ్రహించి విపులీకరించె నని తెలియ గలదు. ఈవ్యాకరణవిభాగములను పరిశీలించిన ఇది స్పష్టమగును.

| లఘువ్యాకరణము | బాలవ్యాకరణము |
|---|---|
| 1. సంజ్ఞాపరిచ్ఛేదము | 1. సంజ్ఞాపరిచ్ఛేదము |
| 2. సంధిపరిచ్ఛేదము | 2. సంధిపరిచ్ఛేదము |
| 3. సుబన్తపరిచ్ఛేదము | 3. తత్సమపరిచ్ఛేదము |
| (1) తత్సమములగు నజంత శబ్దముల ప్రకరణము | 4. ఆచ్ఛికపరిచ్ఛేదము |
| (2) అచ్చ తెనుఁగు శబ్దముల ప్రకరణము | 5. కారక ప్రకరణము |
| (3) విభక్త్యర్థక ప్రకరణము | 6. సమాస ప్రకరణము |
| (4) సమాస ప్రకరణము | 7. తద్ధిత ప్రకరణము |
| 4. క్రియాపరిచ్ఛేదము | 8. క్రియాపరిచ్ఛేదము |
| | 9. కృదంతపరిచ్ఛేదము |
| | 10. ప్రకీర్ణపరిచ్ఛేదము |

ఈలఘువ్యాకరణము వారి పుత్రులగు కీ. శే॥ శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులుగారు కాని నేడు వారి ప్రపౌత్రుడు శ్రీ వేంకటరాయుడుగారు కాని ముద్రింపలేదు. మాకులభ్యమైన ఏకైక ప్రతినిబట్టి సూచనలతో నేడు ముద్రించితిమి.

బాలవ్యాకరణమునకు పూర్వమే నిట్టి వ్యాకరణములు రచితములై ప్రచారములోనున్నవని తెలుపుటకును శ్రీ వేంకటరమణశాస్త్రులవారు మాబంధుకోటివారు అగుటచేతను దీని ముద్రణము మాకు మిగుల నుత్సాహముగల్గింప ముద్రించినారము. దీనిని విద్వల్లోక మాదరించును గాక !

కొన్నియెడల శ్రీసూరిగారిచ్చినయుదాహరణముల నిందు లోనివిగ కన్పట్టుచున్నవి. వానిని ఆయాపట్టుల గ్రంథములో సూచించియున్నాము. బాలవ్యాకరణము ముద్రితమైన వెనుక నీవ్యాకరణమును శ్రీవేదము వేంకటరమణశాస్త్రులవారు సంస్కరించినను వారేమో స్వల్పములగుమార్పులు జేసినట్లును గ్రంథప్రణాళికగాని సూత్రములుగాని మార్పుచేయనట్లు వ్రాయుటచే ఈవ్యాకరణమునుండి శ్రీచిన్నయసూరిగారే కొన్నివిషయములు గ్రహించియుందురని తలంచుచున్నాను.

తెండయార్పేట<br>
చెన్నపురి.—1951.

ఇట్లు,<br>
వావిళ్ల వేంకటేశ్వరులు.

శ్రీ ర స్తు

# ల ఘు వ్యా క ర ణ ము

## ఆం ధ్ర వ్యా క ర ణ ము



### సంజ్ఞాపరిచ్ఛేదము

ఆంధ్రవ్యాకరణ మనఁగాఁ దెనుఁగుభాషయందలి శబ్దములను సుష్ఠుగాఁ దెలిసికొనుటకును, ప్రయోగించుటకును, వ్రాయుటకును సర్వాంబగు జ్ఞానమును గలుగఁజేసెడు శాస్త్రము.

ఈశాస్త్రము సంజ్ఞాపరిచ్ఛేద మనియుం, సంధిపరిచ్ఛేద మనియుం, సుబన్తపరిచ్ఛేద మనియుఁ, క్రియాపరిచ్ఛేద మనియుం నాలుగు పరిచ్ఛేదములుగా విభజింపఁబడియున్నది.

అచ్చులు మొదలగువానికిఁ బ్రాణాదిసంజ్ఞలను విధించునది సంజ్ఞాపరిచ్ఛేద మనఁబడును.

అజంత, హలంత శబ్దంబు లితరశబ్దంబులతోఁ గూడునపుడు వానికిం గలుగు సంధిమొదలగువానిం దెలియఁజేయునది సంధిపరిచ్ఛేదము.

తత్సమాదులగు సుబన్తశబ్దములయొక్క రూపనిష్పత్తిని వివరించునట్టిది సుబన్తపరిచ్ఛేదము.

తత్సమాదులగు క్రియలయొక్క రూపనిష్పత్తిని వివరించునట్టిది క్రియాపరిచ్ఛేదము.

౧. సంస్కృతభాషకు వర్ణంబు లేఁబది.

---

౧. చూ. బా. సం. సూ. ౧

౨. అందచ్చులు పదియాఱు.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః.

౩. హల్లులు ముప్పది నాలుగు.

క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ.

౪. ప్రాకృతమునకు వర్ణంబులు నలువది.

౫. అందచ్చులు పది.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః.

౬. హల్లులు ముప్పది.

క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ స హ ళ.

సంస్కృతప్రాకృతాక్షరంబులవలననే యాంధ్రభాష పూర్ణముగా సిద్ధించుటవలన వానివివరణం బావశ్యకంబు.

౭. అచ్చతెలుఁగుభాషకు వర్ణములు ముప్పదియేడు.

౮. అందచ్చులు పదునాలుగు.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ఁ ం.

౯. హల్లు లిరువదిమూఁడు.

క గ చ ౘ జ ౙ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ ఱ.

౧౦. అనాద్యంబులగు వర్ణంబు లాఱు

ఎ ఒ ఁ ౘ ౙ ఱ

ఋ ౠ ఌ ౡ ః ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ థ ధ ఫ భ శ ష ఈవర్ణంబులు తత్సమాన్యదేశ్యంబులంగూడి తెలుఁగునం జేరుచున్నవి.

---

౪—౧౦ చూ. బా. సం. సూ. ౨, ౩, ౪.

కావునం దత్సమాదిభేదంబులచేఁ జతుర్విధం బగు నీయాంధ్రభాష యేఁబదియాఱువర్ణంబులచేతఁ బూర్ణంబుగ సిద్ధించుచున్నది.

ఉ. బుషభుఁడు - బూకారము - క్షత్తము - ఖరము - ఘనము మొదలగునవి తత్సమములకు నుదాహరణములు.

ఠావు-ఢాక-ఖిళి మొదలగునవి యన్యదేశ్యములకు నుదాహరణములు.

౧౧. ముం దుదాహరింపంబడిన యేఁబదియాఱువర్ణంబులును మూఁడుభాగములుగా విభజింపఁబడియున్నవి.

౧౨. అచ్చులు హల్లులు ఉభయాక్షరము లని.

౧౩. ఔకారంబు తుదిగాఁ గల అకారాదు లచ్చులు.

౧౪. ళకారంబు తుదిగాఁ గల కకారాదులు హల్లులు.

౧౫. ఖండపూర్ణానుస్వారవిసర్గంబు లుభయాక్షరంబులు. అనఁగా నీమూఁడువర్ణంబు లచ్చులు హల్లులు నగు నని తాత్పర్యము.

౧౬. సున్న బిందు వనంబడు.

౧౭. సిద్ధం బనియు సాధ్యం బనియు సున్న ద్వివిధంబు.

౧౮. అది పూర్ణ మనియు ఖండ మనియు మఱియుం ద్వివిధంబు.

౧౯. శబ్దంబుతోడం గలుగునది సిద్ధంబు.

౨౦. శాస్త్రంబుచేఁ గలుగునది సాధ్యంబు.

౨౧. హ్రస్వంబుమీఁది ఖండబిందువు పూర్ణంబు నగును.

౨౨. దీర్ఘంబుమీఁది ఖండపూర్ణ బిందువులు పూర్ణ ఖండంబులుగావు.

ఉదాహరణములు:—కలఁగి-కలంగి-చెలఁగి-చెలంగి - నెలఁత-నెలంత - అలఁతి - అలంతి ఇత్యాదులు సిద్ధఖండపూర్ణబిందువులకు నుదాహరణములు.

---

౨౧. చూ. బా. సం. సూ. ౧౪.

రాముఁడు - రాముండు - వచ్చెఁగవలాతుఁడు - వచ్చెంగవలాతుండు మొదలగునవి సాధ్యఖండపూర్ణములకు నుదాహరణములు.

వాఁక - పీఁక - కాంచి - వాంచి దీర్ఘముమీఁది సిద్ధఖండపూర్ణములకు నుదాహరణములు.

వాఁడు - వాండ్రు దీర్ఘముమీఁది సాధ్యఖండపూర్ణబిందువులకు నుదాహరణములు.

## ౨౩. సంస్కృతవ్యాకరణంబునందుఁ గలసంజ్ఞలకుఁ దెనుఁగు సంజ్ఞలు.

౨౪. అచ్చులు ప్రాణములు.

౨౫. అందు హ్రస్వములు కుఱుచలు.

అ ఇ ఉ ఋ ఌ ఎ ఒ

౨౬. దీర్ఘములు నిడుదలు.

ఆ ఈ ఊ ౠ ౡ ఏ ఐ ఓ ఔ

౨౭. ఎ ఏ ఒ ఓలు వక్రములు.

౨౮. ఐ ఔలు వక్రతమములు.

౨౯. హల్లులు ప్రాణులు.

౩౦. అందు కచటతపలు పరుషములు.

౩౧. గజడదబలు సరళములు.

౩౨. [illegible]

ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ ణ న మ య ర ల వ శ ష స హ ళ ఱ

---

౩౦, ౩౧, ౩౨. చూ. బా. సం. సూ. ౫, ౬.

### ౩౩. నకారంబు ద్రుతంబు.

### ౩౪. ద్రుత మంతమందుఁ గలవి ద్రుతప్రకృతికములు.

ఉ. పశువునందున్ - మనుష్యునిన్ - బాలునిచేతన్ - వర్షమువలనన్ - చూచెన్ - కాంచన్ మొ.

### ౩౫. ఇతరంబులు కళలు.

అంతమునందు ద్రుతము గలుగనిశబ్దము లన్నియుఁ గళ లనంబడు నని యర్థము.

ప్రథమ, కూర్చి, - కయి, - పట్టి, - యొక్క - లును, డుమంత మధ్యమపురుష రాంతమాంత క్రియలును, ఇంచుక, - కొంచెము, - అంత, - ఇంత, మొదలగునవియును, భళి - బాపురె, మొదలగు ప్రశంసావాచకంబులును, ఔర - ఆహా మొదలగు నాశ్చర్యవాచకంబులును, అక్కట - అయ్యో, - కటకట యనునవియుం, అప్పు డిప్పు డెప్పు డేమి యనునవియు, ఎ ఏ అ ఏతదంతంబులును, వండి, - వండక, - ఊరక, - మిన్నక, - ఏల, ఇత్యాదులును కళలు.

### ౩౬. అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ అనునచ్చులం గూడిన తెనుఁగు చ జ లు దంత్యంబులు.

ఉ. చలువ - చట్టు - చాయ - చాటు - చుట్ట - చుఱుకు - చూపు - చూరు - చొప్పు - చోఱవ - చోటు - చోపు - చౌడు - జత - జాలి - జుట్టు - జూదము - జొన్న-జోలి, జౌకు మొ.

### ౩౭. ఇ ఈ ఎ ఏ లంగూడిన చ జ లు తాలవ్యములు.

ఉ. చిలువ - చిట్టకము - చీమ - చీకు - చెట్టు - చెఱకు - చేయి చేటు - జిడ్డు - జిలుగు - జీలుగు - జేర - జేన - జేగురు మొ.

ఇది సంజ్ఞాపరిచ్ఛేదము.

---

౩౩, ౩౬, ౩౭. చూ. బా. సు. సూ. ౧౧. ౯. ౮.

# సంధిపరిచ్ఛేదము



అజంతశబ్దముల కజాదిశబ్దములు పరంబు లగునపుడు పూర్వాచ్చునకుం బరరూపము గలుగుటయు, హలంతశబ్దములకు హలాదిశబ్దములు పరంబులగు నపుడు పూర్వపరవర్ణంబులకు రూపాంతరంబులు మొదలగునవి గలుగుటయును సంధి యనంబడు.

తెనుఁగునందు నచ్చులలో అకార, ఇకార, ఉకారములకే దఱచుగా సంధి యగు.

**౧. అకారమున కచ్చు పరంబగునపుడు సంధి * విభాష నగు.**

ఉ. మేన + అత్త = మేనత్త, వంటల + అక్క = వంటలక్క.

**౨. సంధిలేనియెడ నచ్చున కచ్చు పరంబగునపుడు నడుమ యకారం బగు.**

ఉ. మేన + అత్త = మేన యత్త.

వంటల + అక్క = వంటల యక్క.

మామ + అల్లుఁడు = మామ యల్లుఁడు.

కాయ + ఏది = కాయ యేది.

అమ్మ + ఇచ్చినది = అమ్మ యిచ్చినది.

తల్లి + అడిగెను = తల్లి యడిగెను.

వచ్చి + ఏఁగెద = వచ్చి యేఁగెద. మొ.

---

* విభాష, వికల్పకము ఇవి సమానార్థకములు. విధి యొకప్పుడు వచ్చును, ఒకప్పుడు రా దని యర్థము.

౧, ౨. చూ. బా. సంధి. సూ. ౪, ౩.

3. వెలయాల్వాదులం దక్క సంజ్ఞలయం దకారమునకు సంధి నిత్యము

ఉ. పొన్న + ఆకు = పొన్నాకు.
చింత + ఆకు = చింతాకు
రామ + అయ్య = రామయ్య
పాప + అయ్య = పాపయ్య
రామ + అన్న = రామన్న.
అయ్య + అప్ప = అయ్యప్ప. మొ.

వెలయాల్వాదులయందు వెలయాలు, మామయల్లుఁడు మొదలగునవి.

౪. తత్సమములయందును స్త్రీలింగస్త్రీసమసంబోధనంబులందును, అకారంబునకు సంధి లేదు.

ఉ. భర్త + అతఁడు = భర్త యతఁడు.
విధాత + ఇతఁడు = విధాత యితఁడు.
వనిత + అనియెన్ = వనిత యనియెన్.
భార్య + ఆనతి = భార్య యానతి.
అమ్మ + ఇది = అమ్మ యిది.
అక్క + అలిగెన్ = అక్క యలిగెన్.
అన్న + అడుగో = అన్న యడుగో.
గోడ + అది = గోడ యది.
రాముఁడ + ఇందము = రాముఁడ యిందము.
అన్న + ఇమ్ము = అన్న యిమ్ము.

౫. మధ్యమపురుషక్రియలయందు నికారంబునకు సంధి నిత్యము.

---

3. చూ. ౪ సూత్రము. ౫. చూ. బా. సంధి. సూ. 2.

ఉ. సేవించితివి + అయ్యాను = సేవించితి వయ్యాను.

చూచితివి + అతనిని = చూచితి వతనిని

పెట్టితిరి + అన్నమును = పెట్టితి రన్నమును

పోషించితిరి + అందఱిని = పోషించితి రందఱిని.

౬. సంఖ్యలయందేసిపదంబు పరంబగుచో నికారంబునకు సంధి నిత్యము.

ఉ. ఎనిమిది + ఏసి = ఎనిమిదేసి

తొమ్మిది + ఏసి = తొమ్మిదేసి

ఇరువది + ఏసి = ఇరువదేసి. మొ.

౭. ప్రథమోత్తమపురుషక్రియలయందును నేమి మొదలగు వానియందును నికారంబునకు సంధి వైకల్పికము.

ఉ. వచ్చిరి + అధికారులు = { వచ్చి రధికారులు / వచ్చిరి యధికారులు }

పోషించిరి + అందఱిని = { పోషించి రందఱిని / పోషించిరి యందఱిని }

వచ్చితిని + అక్కడికి = { వచ్చి తక్కడికి / వచ్చితి నక్కడికి }

చూచితిమి + అతనిని = { చూచితి మతనిని / చూచితిమి యతనిని. }

చేరితిమి + ఊరిని = { చేరితి మూరిని / చేరితిమి యూరిని. }

* ఏమి - మఱి - కిమన్ని - అది - అవి - ఇది - ఇవి - ఏది - ఏవి - ఏది - ఏవి - మొదలగునవి యేమ్యాదులు.

---

* సంధి సూ. ౬. ౫

ఉ. ఏమి + అయ్యా = { ఏమయ్యా / ఏమియయ్యా

మఱి + ఏమి = { మఱేమి / మఱియేమి

తల్లికిన్ + ఇచ్చెన్ = { తల్లికిచ్చెన్ / తల్లికినిచ్చెన్

అది + ఏమి = { అదియేమి / అదేమి

ఇది + ఎట్లు = { ఇదెట్లు / ఇదియెట్లు

ఏది + అయ్యా = { ఏదయ్యా / ఏది యయ్యా

అవి + ఏవి = { అవేవి / అవి యేవి

ఎనిమిది + అవది = ఎనిమిదవది, ఎనిమిదియవది. మొ.

౮. ఉకారంబున కచ్చుపరంబగునపుడు సంధి నిత్యము.

ఉ. దేవుఁడు + అతఁడు = దేవుఁడతఁడు.

కుమారుఁడు + ఇతఁడు = కుమారుఁడితఁడు.

ఊరు + ఎక్కడ = ఊరెక్కడ. మొ.

౯. ద్వితీయాదివిభక్తి వర్తమానార్థకచువర్ణకంబులయందు ఉకారంబునకు సంధి వైకల్పికము.

౧౦. ద్రుతాంతములగు నచ్చులకు వైకల్పికసంధి రానిచో ద్రుతము గానంబడు.

౮, ౯, ౧౦. సంధి సూ. ౧, ౨. సూ. ౨, ౯.

ఉ. నన్నున్ + ఏలెన్ = నన్నేలెన్, నన్ను నేలెన్

మమ్మున్ + అడిగెన్ = మమ్మడిగెన్, మమ్ము నడిగెన్

నాకొఱకున్ + ఇచ్చెన్ = నాకొఱ కిచ్చెన్, నాకొఱకు నిచ్చెన్.

నీకున్ + ఎఱుక = నీకెఱుక, నీకు నెఱుక.

వానియందున్ + ఆశ = వానియం దాశ, వానియందు నాశ,

అఱచుచున్ + ఉండెన్ = అఱచుచుండెన్, అఱచుచు నుండెన్.

వచ్చుచున్ + ఉన్నాఁడు=వచ్చుచున్నాఁడు, వచ్చుచు నున్నాఁడు.

౧౧. సమాసంబులయం దుత్తరపదంబులగు అది-అవి శబ్దంబుల అకారంబునకుఁ బూర్వరూపసంధి వైకల్పికముగా నగును.

ఉత్తరపద మనఁగా సమాసమందు కడపటిపదము. పూర్వరూప మనఁగా వెనుకటి యచ్చుయొక్క రూపము.

ఉ. కాఁపు + అది = కాఁపుది. ఇచట వైకల్పికంబుగాఁ బరరూప సంధియుం నగు.

ఉ. కాఁపు + అది = కాఁపది, కాఁపయది.

బాపన + అది = బాపనది, బాపనయది.

కోమటి + అది = కోమటిది, కోమటియది.

కమ్మ + అది = కమ్మది, కమ్మయది.

నా + అవి = నావి, నాయవి. మొ.

౧౨. ఎఁడువర్ణకమును, ఇంచుక్కును పరంబులగునపు డచ్చులకు సంధి నిత్యము.

ఉ. చేఱ + ఎఁడు = చేఱెఁడు.

మూఱ + ఎఁడు = మూఱెఁడు.

పుట్టి + ఎఁడు = పుట్టెఁడు.

తూము + ఎఁడు = తూమెఁడు.

పీసె + ఎఁడు = పీసెఁడు.

పోష + ఇంచు = పోషించు.

రక్ష + ఇంచు = రక్షించు. మొ.

ఇకారాంతములగు తత్సమక్రియలకు ఇంచు పరంబగునపు డీసంధి రాదు.

గణియించు - ఘటియించు. మొ.

## ౧౩. ఎఁడు పరంబగుచో దోసిలి మొదలగుశబ్దంబుల లివర్ణంబు లోపించును.

ఉ. దోసిలి + ఎఁడు = దోసెఁడు.

కనికిలి + ఎఁడు = కనికెఁడు.

బెత్తిలి + ఎఁడు = బెత్తెఁడు.

కమికిలి + ఎఁడు = కమికెఁడు. మొ.

## ౧౪. ఇఁకాదులయందుఁ దప్ప ద్రుతాంతములగు నచ్చులకు సంధి లేదు.

ద్వితీయాదివిభక్తిసూత్రముచేత విధింపఁబడిన చోటులయందును, ఇఁకాదులయందును దప్పఁ దక్కినద్రుతాంతములగు నచ్చులకు సంధి గలుగ దని తాత్పర్యము.

ఇఁకాదులు— ఇఁకన్ - ఇగన్ - ఎట్టకేలకున్ - ఎట్టకేనిన్. వీనియందు సంధివైకల్పికము.

ఇఁకేమి - ఇఁకనేమి; ఇగేమి - ఇగనేమి; ఎట్టకేల కనియెన్ - ఎట్టకేలకు ననియెన్. మొ.

అచ్చోటన్ + ఉండెన్ = అచ్చోట నుండెన్.

చేయన్ + అకార్యమును = చేయ నకార్యమును.

వచ్చున్ + అతఁడు = వచ్చు నతఁడు. మొ.

**౧౫. ఆమ్రేడితంబు పరంబగునపుడు పూర్వపదంబు తుది యచ్చునకు లోపం బగు.**

ఆమ్రేడితం బన ద్విరుక్తమునందుఁ బరరూపము.

ఉ. ఓహో + ఓహో = ఓహోహో

ఔర + ఔర = ఔరౌర. మొ.

**౧౬. ద్రుతప్రకృతికంబులకంటెం బరంబులగు పరుషంబులకు సరళంబు లగు.**

ఉ. కొడుకున్ + కొట్టెను = కొడుకున్ గొట్టెను.

పులిన్ + చంపెను = పులిన్ జంపెను.

చదివెన్ + చరిత్రమును = చదివెన్ జరిత్రమును.

వానికిన్ + టక్కు తెలియదు = వానికిన్ డక్కు తెలియదు.

నన్నున్ + తఱిమెను = నన్నున్ దఱిమెను.

సాక్ష్యమున్ + పలికెను = సాక్ష్యమున్ బలికెను. మొ.

**౧౭. ఆద్రుతమునకు బిందుస్వత్వప్రకృతిభావంబులు విభాష నగును.**

బిందు వనఁగా ఖండపూర్ణానుస్వారములు. స్వత్వం బనఁగా నుకారేకారంబులు. ప్రకృతిభావం బన ద్రుతరూపంబు.

ఉ. కొడుకుం గొట్టెను. తండ్రిం బోషించెను.

కొడుకుఁ గొట్టెను. తండ్రిఁ బోషించెను.

కొడుకును గొట్టెను. తండ్రిని బోషించెను.

కొడుకున్ గొట్టెను. తండ్రిన్ బోషించెను.

**౧౮. బిందు వాంధ్రంబునందుఁ బరుషసరళములకుఁ బూర్వంబుగ నుండు.**

---

౧౫. మా. బా. సంధి. ౧౦.

ఉదాహరణంబులం దెలియ నగు.

౧౯. సరళస్థిరవర్ణంబులు పరంబులగునపుడు ద్రుతంబునకు లోపస్వత్వ సంశ్లేషంబులు వైకల్పింబుగ నగును.

పాఠముఙ్ + గ్రహింపుము = పాఠము గ్రహింపుము.
వానికిఙ్ + జడిసెన్ = వానికి జడిసెన్.
వీనికిఙ్ + డబ్బు కలదు = వీనికి డబ్బు గలదు.
దానికిఙ్ + దారి చూపుము = దానికి దారి చూపుము.
దేశమునకుఙ్ + వెడలెను = దేశమునకు వెడలెను.
చెట్టుఙ్ + నఱికెను = చెట్టు నఱికెను.
వృక్షముఙ్ + ఖండించెను = వృక్షము ఖండించెను.

స్వత్వసంశ్లేషముల కుదాహరణములు.

పాఠముఙ్ + గ్రహింపుము = పాఠము న్గ్రహింపుము. పాఠమును గ్రహింపుము.
వృక్షముఙ్ + ఖండించెను = వృక్షము న్ఖండించెను. వృక్షమును ఖండించెను.

౨౦. సరళస్థిరంబులు పరంబు లగుచో నొకానొకచోటం ద్రుతంబునకుఁ బూర్ణబిందు వగు.

ఉ. పాడెన్ + గంధర్వుఁడు = పాడెం గంధర్వుఁడు.
పూనెన్ + ధనువును = పూనెం ధనువును.

౨౧. ఇఁక, - అఁట, - యనుశబ్దంబులం దక్క ప్రథమ హ్రస్వంబు మీఁద ఖండబిందు న లోపంబులు గలుగవు.

ఉ. చె.దోప - కొంపమ్మి - కన్దోయి - ఇచట ఖండబిందుద్రుత లోపంబులు గలుగవు. కాన నుదాహరణంబు వ్యతిరేకం బని యెఱుంగునది.

౨౨. వాక్యాంతపదాంతద్రుతంబునకు లోపంబు వైకల్పికము.

ఉ. చేసెం జూచె - చేసెం జూచెన్.
నేను వచ్చెద - నేను వచ్చెదన్. మొ

---

౨౦. బా. సంధి. సూ. ౧౯. మొదటియుదాహరణము సమానము.

౨౩. సమాసంబులయందు ద్రుతంబునకు లోపంబు నిత్యంబు.

ఉ. అతనిన్ + ఆకారము = అతనియాకారము.
రాజులన్ + ప్రాపు = రాజులప్రాపు.

తలఁబ్రాలు మొదలగుసమాసంబులయం దీలోపంబు లేదు. తలఁబ్రాలు, వడిఁబ్రాలు, ఊరఁబంది. మొ.

౨౪. తాను నేను శబ్దములం దప్ప ప్రథమమీఁది కచటతప-లకు గసడదవ - లగు.

ఇక్కార్యంబు క్రియలయందును నగు.

ఉ. రాముఁడు + కొట్టెను = రాముఁడు గొట్టెను.
యత్నము + చేయుచున్నాఁడు = యత్నము సేయుచున్నాఁడు.
కుక్క + తఱుముచున్నది = కుక్క దఱుముచున్నది.
వాఁడు + పోవుచున్నాఁడు = వాఁడు వోవుచున్నాఁడు.
వీఁడు + టక్కరి = వీఁడు డక్కరి.
చేయుచున్నాఁడు + కార్యమును = చేయుచున్నాఁడు గార్యమును. మొ.

తాన్ + చెప్పెన్ = తాఁజెప్పెన్.
నేన్ + చదివితిన్ = నేఁజదివితిన్.

ఇట్లు తాను నేను శబ్దములమీఁద గజడదబ లగును.

౨౫. ద్వంద్వంబునఁ గచటతపలకు గసడదవలు నిత్యంబుగ నగు.

ఉ. కూరలు + కాయలు = కూరగాయలు.
కాళ్లు + చేతులు = కాలుసేతులు.
టక్కు + టెక్కు = టక్కుడెక్కులు.
తల్లి + తండ్రి = తల్లిదండ్రులు.
ఊరు + పల్లె = ఊరుపల్లెలు.

---

౨౪. క్రీచూ. బా. సంధి. సూ. ౧౩.

**౨౬. తెనుఁగులమీఁది తత్సమంబుల కచటతపలకు గసడదవలు రావు.**

ఉ. ఆయనచరిత్రకారుఁడు, - వీఁడుకార్యవాది, - ఇతఁడు టంకశాలి - వారు తస్కరులు - వారు పావనులు. మొ.

**౨౭. కర్మధారయసమాసమం దుకారాంతపదమున కచ్చు పరంబగునపుడు టకారాగమంబు తఱచుగ నగు*.**

ఉ. చిగుఱు + ఆకు = చిగుఱుటాకు, చిగురాకు

కఱకు + అమ్ము = కఱకుటమ్ము, కఱకమ్ము

పేరు + ఆముని = పేరుటాముని, పేరాముని.

ఇత్యాదులవైకల్పికము.

నిగ్గు + అద్దము = నిగ్గుటద్దము ఇత్యాదుల నిత్యము.

దుక్కి + ఎద్దు = దుక్కిటెద్దు } ఇచ్చట నలక్ష్యమునం

వేల్పు + ఆవు = వేల్పుటావు } దును టకారాగమంబు.

**౨౮. ఈ టకారాగమంబు కొన్నిటం ద్విరుక్తంబై యాదేశం బగు**

ఉ. కుఱు + ఉసురు = కుట్టుసురు

చిఱు + ఎలుక = చిట్టెలుక. మొ.

**౨౯. కర్మధారయమునం దాలుశబ్దము పరంబగుచో నకారంబునకు నుత్వంబును, మీఁద రేఫంబును నగు. ఉకారాంతములకు రేఫాగమంబుమాత్ర మగు.**

---

* కర్మధారయసమాస మనఁగా విశేషణ మగు ప్రథమాంతపదము విశేష్య మగు ప్రథమాంతపదముతోఁగూడి యొకపద మగుట. తఱచు అనగాఁ గొన్నిట నిత్యము, గొన్నిట వైకల్పికము కొన్నిట నలక్ష్యప్రవృత్తియుం నని యర్థము.

౨౮. చూ. బా. సంధి. సూ. ౪౧.౨.

ఉ. ధీర + ఆలు = ధీరురాలు
శూర + ఆలు = శూరురాలు
బుద్ధిమంత + ఆలు = బుద్ధిమంతురాలు
గొడ్డు + ఆలు = గొడ్డురాలు
గొడ్రాలని యుకారలోపంబును గలదు.

౩౦. తద్భవదేశ్యంబుల కాలుశబ్దము పరంబగుచో నకారంబున కుత్వంబు గలుగదు.

ఉ. జవ + ఆలు = జవరాలు
ముద్ద + ఆలు = ముద్దరాలు
పేద + ఆలు = పేదరాలు
బాలింత + ఆలు = బాలింతరాలు. మొ.

౩౧. షష్ఠీసమాసమం దుకార ఋకారాంతపదంబుల కచ్చుపరంబగునపుడు నకారం బంతాగమం బగు.

రాజు + ఆనతి = రాజునానతి
మోము + అందము = మోమునందము.
పాము + ఎమ్ములు = పామునెమ్ములు.
పితృ + ఆజ్ఞ = పితృనాజ్ఞ
విధాతృ + ఆనతి = విధాతృనానతి.

౩౨. సమాసములయం దుకారాంతపదంబులకుఁ బహువచనంబులు పరంబులగునపుడు నకారాగమం బగు. ఈ నకారాగమంబునకు స్వత్వలోపంబులు దక్క ద్రుతకార్యం బంతయుఁ గానంబడు.

---

సూ——౩౧. చూ. బా. సంధి. సూ. ౧౫. ౨౯. ౩౦. ౩౪.

చిగురు + కొమ్మదువు = చిగురున్ గొమ్మదువు
= చిగురుంగొమ్మదువు
= చిగురుఁగొమ్మదువు.

గండు + కోయిల = గండున్ గోయిల
= గండుంగోయిల
= గండుఁ గోయిల

తళుకు + గజ్జెలు = తళుకుంగజ్జెలు
= తళుకున్గజ్జె...

33. ఈ నకారాగమము - గూర్చి - పట్టి - చేసి
విభక్తి తెనవర్ణకంబులు ప... బులగునపుడును
పుంపులమీఁదను నగు.

ఉ. ధనమునందున్ - ధనువునందున్ - వనముంగూర్చి - జ్ఞానముం బట్టి - వచ్చుటంజేసి - చక్కందనము - నొగసు దనము-కుందనంపుంజవికె - పటికంపుంగోడలు - ఇత్యాదులు.

34. సమాసంబునందు ఆ ఈ-ఏ-అను సర్వనామంబులకుఁ గుఱుచలును వైకల్పికముగ ద్విత్వము విభాష నగు.

ఉ. ఆ యతివ - అయ్యతివ
ఈ యినుఁడు - ఇయ్యినుఁడు
ఏ యంవిద - ఎయ్యంవిద
ఆ కథకుఁడు - అక్కథకుఁడు
ఈ పురుషున్ - ఇప్పురుషున్.

---

3౨. 3౫. చూ. బా. సంధి. 3౫.

అసమాసంబునందును ద్విత్వకార్యం బగు.

ఆడి - అడ్డి, ఇది - ఇద్ది, ఎది - ఎద్ది. మొ.

3౫. ఊష్మరేఫంబులు పరంబులగుచో నిది రాదు (శ ష స హ లూష్మంబులు).

ఉ. ఆ శబ్దము - ఈ షణ్ముఖుఁడు.

ఏ సంజ - ఆ హోర - ఈ రాముఁడు.

ఇది సంధిపరిచ్ఛేదము.



# సుబన్తపరిచ్ఛేదము

సుప్పు లనఁగాఁ బ్రథమాదివిభక్తులు. అవి యంతమునందువచ్చు నామవాచకములరూపనిష్పత్తిని వివరించునట్టిది సుబన్తపరిచ్ఛేదము. ఈపరిచ్ఛేదమునందుఁ [1]దత్సమంబులగు అజన్తశబ్దముల ప్రకరణమును హలన్తశబ్దముల ప్రకరణమును, అచ్చతెలుఁగుశబ్దముల ప్రకరణమును, విభక్త్యర్థప్రకరణమును, సమాసప్రకరణమును, నిరూపింపఁబడును.

విభక్తి యనఁగా నొకశబ్దమునకు మఱియొకశబ్దముతోఁ గలిగెడు సంబంధమును దెలియఁజేసెడు రూపము.

అట్టి విభక్తు లేడు.

౧. డు - ము - వు - లు - ప్రథమ.

౨. ని - ను - ల - కూర్చి - ద్వితీయ.

౩. చేత - చే - తోడ - తో - తృతీయ.

౪. కొఱకు - కై - చతుర్థి.

౫. వలన - కంటె - పట్టి - పంచమి.

౬. కి - కు - యొక్క - లోపల - లో - షష్ఠి.

౭. అందు - న - సప్తమి.

౮. డు - ము - వు - ని - ను - న - లేకవచనంబులు.

౯. లు - ల - లో - లోపలలు బహువచనంబులు.

౧౦. తక్కినవి యుభయవచనంబులు.

---

1. చూ. బా. తత్సమపరిచ్ఛేదము - ౧ - ౧౧ సూత్రములు.

౧౧. ఎదటివారిని బిలుచునపుడు నామవాచకంబుమీఁదనున్న ప్రథమావిభక్తి సంబోధనప్రథమావిభక్తి యనంబడు.

౧౨. మహదమహత్సంబోధనంబున నామంబునకుఁ బూర్వము ఓ ఓయి ఓరీ యనునవ్యయంబులు విభాషనగు.

మహత్తులకు, ఓ, ఓయి, అమహత్తులకు ఓయను నగు నని యర్థము.

ఉ. ఓరాజా - ఓయిరాజా - రాజా - ఓవృక్షమ - వృక్షమ.

౧౩. నీచమిత్ర స్త్రీ పురుష సంబోధనంబున నోసి ఓరీ యనునవ్యయంబులు విభాష నగు.

ఉ. ఓసి దాసి - ఓసి యమ్మ - ఓసి యక్క - ఓరి దుష్టుడ - ఓరి యన్న - ఓరి చెలికాఁడా.

౧౪. పురుషవాచకంబులును వానివిశేషణంబులును మహత్తులు.

ఉ. రాముఁడు - యోగ్యుఁడు; భీముఁడు - ధీరుఁడు.

౧౫. ఇతరంబులును వానివిశేషణంబులును నమహత్తులు.

ఉ. వృక్షము ఉన్నతము - లత దీర్ఘము - ఆవు తెల్లనిది - దూడ నల్లనిది.

౧౬. గుణయోగంబునఁ గొన్ని యమహత్తులు మహత్తు లగు. గుణయోగ మనఁగాఁ బురుషగుణసాదృశ్యము కలిగియుండుట.

ఉ. సముద్రుఁడు - మేఘుఁడు-హిమవంతుఁడు - మైనాకుఁడు. మొ.

౧౭. మహత్తులసంబంధమైన స్త్రీవాచకంబు మహతీ యనంబడు.

ఉ. అంబ - రమ - గౌరి - వాణి - అమ్మ - తల్లి.

---

౯ - ౧౩. చూ. బా. సూ. ౧౨ - ౧౬.

## అజన్తప్రకరణము

౧౮. విభక్తులు వచ్చునప్పుడు మహత్తుల యంత్యాకారంబునకు ఉకారం బగు.

౧౯. ఉకారాంతములగు మహత్తులకు బిందుపూర్వక డువర్ణకంబు ప్రథమైకవచనం బగు.

డువర్ణకము అంతమునందు వచ్చునట్టిశబ్దములు డుజంతంబు లనంబడు.

౨౦. నామంబులకుఁ బ్రథమాబహువచనంబు లువర్ణకంబగు.

ఉ. పురుషుఁడు } పురుషులు.
పురుషుండు.

౨౧. సంబోధనంబున నేకవచనంబునకు అకారాగమంబును బహువచనంబునకు ఆర యనునాగమంబును నగు.

౨౨. సంబోధనంబున డువర్ణకంబునకు లోపంబు వైకల్పికంబు.

౨౩. సంబోధనంబున నంత్యాచ్చునకు దీర్ఘంబు వైకల్పికంబు.

ఉ. ఓపురుషుఁడ. ఓపురుషుఁడా. ఓయిపురుషుఁడ, ఓయిపురుషుఁడా. ఓపురుష, ఓపురుషా ఓపురుషులార, ఓపురుషులారా. ఓయి పురుషులార. ఓయి పురుషులారా.

౨౪. మహత్తులకును ఇవర్ణాంతములకును ద్వితీయైకవచనంబు నివర్ణకంబగు. అది విభాషను లోపించు.

ఉ. పురుషునిన్. } పురుషులన్.
పురుషున్

౨౫. నామంబులకు ద్వితీయాబహువచనంబు లవర్ణకం బగు.

౨౬. తృతీయ మొదలగు నేకవచనంబులు పరంబులగుచో మహాత్ములమీఁద న్యాగమంబు విభాష నగు.
(న్యాగమం బన 'ని' యను నాగమంబు).

౨౭. తృతీయాదిబహువచనంబులు పరంబు లగుచో నన్నినామంబులకు లాగమంబు నిత్యంబుగ నగు.

తృ. ఉ. పురుషునిచేతన్
పురుషుచేతన్ } పురుషులచేతన్.

పురుషునిచేన్
పురుషుచేన్ } పురుషులచేన్.

పురుషునితోడన్
పురుషుతోడన్ } పురుషులతోడన్.

పురుషునితోన్
పురుషుతోన్ } పురుషులతోన్.

చ. పురుషునికొఱకున్
పురుషుకొఱకున్ } పురుషులకొఱకున్.

పురుషునికయి
పురుషుకయి } పురుషులకయి.

పం. పురుషునివలనన్
పురుషువలనన్ } పురుషులవలన్.

పురుషునికంటెన్
పురుషుకంటెన్ } పురుషులకంటెన్.

౨౮. షష్ఠీవర్ణకంబు గుణవాచకంబుల కగు.

ఉ. జ్ఞానముంబట్టి

౨౯. నామంబులషష్ఠ్యేకవచనంబునఁ గి కు యొక్క వర్ణకంబులును బహువచనంబునఁ గు యొక్క లో లోపలవర్ణకంబులును నగు. ఇవర్ణాంతంబులు కానిశబ్దంబులమీఁద కిషష్ఠియు నీశబ్దంబుదక్క ఇవర్ణాంతంబులమీఁద కుషష్ఠియుఁ గలుగవు*.

౩౦. కువర్ణకంబు పరంబగుచో నుకారంబుమీఁద నాగమం బగు.

ఉ. పురుషునకున్ ... పురుషులకున్.
పురుషునికిన్ ... పురుషులయొక్క.
పురుషుని యొక్క... పురుషులలోన్.
పురుషుయొక్క ... పురుషులలోపలన్.

౩౧. నామంబులసప్తమీవిభక్తికి అందువర్ణకం బగు. ఈనకారాగమంబనుసూత్రముచేత అందు పరంబగుచో నేకవచనంబున నుకారంబుమీఁద నకారాగమం బగు.

ఉ. పురుషునందున్ - పురుషులయందున్.
పురుషునియందున్ - పురుషులందున్,

బాలభూపాలాది లాంతంబులును నచ్చ తెనుఁగుశబ్దంబులును దక్కఁ దక్కిన ఆకారాంతమహచ్ఛబ్దంబులకెల్ల, రూపనిష్పత్తి యి ట్లెఱుంగునది.

౩౨. అదంతలాంతంబు లగుతత్సమంబులకు బహుత్వంబునందు లు ల లకు రు ర లాదేశంబు లగును.

ఉ. బాలురు - బాలురన్ - మొదలయినవి.

---

* ఆదేశం బన నొకవర్ణంబునకు మాఱుగా మఱియొకవర్ణంబువచ్చుట. ఆగమం బన నెక్కుడు వర్ణంబు వచ్చుట.

## అమహత్తులనుగుఱించి

33. అదంతంబు లగునమహచ్ఛబ్దంబులకుఁ బ్రథమైకవచనంబు మువర్ణకం బగును. దానికి జడ్డయు నెఱసున్నతోడం గూడిన బువర్ణకంబు నగు.

3౪. ఈయవి తక్కినవచనంబులు పరంబు లగునపు డాగమంబు లగు.

ఉ. వనము వనములు.
వనమ్ము వనమ్ములు.
వనంబు వనంబులు.

అమహత్తులకును నడుఁజంతమహత్తులకును ద్వితీయైకవచనంబు నువర్ణకం బగు. దానికి లోపంబు వైకల్పికంబు.

ఉ. వనమునున్ }
వనమ్మున్ } వనములన్. మొ.
వనంబునున్ }
వనంబున్ }

3౫. లక్ష్యలక్షణభావంబునఁ గూర్చి యగు.

జపములఁగూర్చి వర్షించెను. మొ.

3౬. అమహత్తులయుకారంబుమీఁద సప్తమ్యేకవచనంబు నవర్ణకంబు విభాష నగు.

ఉ. వనమ్మునన్ - వనమునన్ - వనమునందున్. మొ.

స్త్రీలింగంబులుగాని యదంతంబు లగునమహచ్ఛబ్దంబుల కెల్లఁ దఱచుగా రూపనిష్పత్తి యి ట్లెయుండునది.

3౭. ఇకారాంతశబ్దంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు.

---

3౨ - బా. సూ. 3. ౮.

౩౮. బహుత్వంబున నికారంబున కుత్వంబగు.

ఉ. పతి - పతులు.

౩౯. సంబోధనంబున నేకవచనంబున అకారాగమంబు లేదు.

ఉ. ఓపతి - ఓపతీ - ఓపతులార - ఓపతులారా.

౪౦. ఇకారాంతములకును వువర్ణకాంతంబులకును డుజంతములు కానిమహత్తులకును ద్వితీయ మొదలగు నేకవచనంబులు పరంబు లగునపుడు న్యాగమంబు లేదు.

ఉ. పతిచేతన్ - పతికొఱకున్. మొ.

మహత్తులు నమహత్తులు నగునికారాంతంబు లెల్ల నిట్టివాక్యంబులు—

౪౧. తత్సమంబు లగునుకార ఓకారాంతశబ్దంబులకు వువర్ణకంబు మువర్ణకంబున ట్లగు.

ఉ. గురువు. మనువు. ధేనువు వస్తువు.

గురువులు. మనువులు. ధేనువులు - వస్తువులు. మొ.

౪౨. మహత్తు లగునుకారాంతంబులకు డువర్ణకంబు విభాష నగు; మన్వాదులకుఁ గలుగదు.

ఉ. గురుఁడు - శంభుఁడు - గురునిన్ - శంభునిన్. మొ.

౪౩. సంబోధనైకవచనంబున నుదంతంబు లగుడువర్ణకాంతంబులకు డువువర్ణకంబులు వైకల్పికంబులు. అవి రానిచో నామాంతంబునకుఁ బ్లుతంబు.—ప్లుత మనఁగా మూఁడు హ్రస్వముల ఉచ్చారణకాలము గలయచ్చు.

ఉ. ఓగురుఁడ - ఓగురుఁడా. ఓగురువ. ఓగురువా - ఓగురూ.

గురువుచేతన్ }
గురునిచేతన్ } మొదలైనవి.

తత్సమంబు లగునెల్ల యుంకారాంతంబులకు రూప మిట్లుండునది.

౪౨ - ౪౩ చూ. బా. త. సూ. ౩౩, ౩౪.

**౭౭. విధాతృ మొదలగు ఋకారాంతంబులకు డువర్ణకంబు విభాష నగు.**

డువర్ణకంబుతోఁ గూడిన నివర్ణకన్యాగమంబులు వచ్చు నని తాత్పర్యము.

ఉ. విధాతృఁడు - పవిత్రుఁడు. విధాతృనిన్-పవిత్రునిన్. మొ.

**౭౫. ఋకారాంతశబ్దంబు లదంతంబు లగు. అంత స్త్రీలింగంబులు స్త్రీలింగతుల్యంబు లగును. స్త్రీలింగతుల్యము లని చెప్పుటచే స్త్రీవాచకంబులగు వనిత మొదలగు శబ్దములతోఁడఁ దుల్యం బగురూపం బగు నని యెఱుంగునది.**

ఉదాహరణములు

స్త్రీవాచకశబ్దంబులయందుఁ జెప్పంబడియెడు. గోశబ్దంబునకు - గోవు. గోవును - గోవులు. గోవులను- మొ.

**౭౬. ఏకాక్షరశబ్దంబులుదప్పఁ దత్సమంబులతుది నిడుదలకుఁ గుఱుచ లగు.**

ఉ. వనితా. సీతా. భామా. గౌరీ.

వనిత. సీత. భామ. గౌరి.

ఏకాక్షరశబ్దంబులు శ్రీ హ్రీ-స్త్రీ-ధీ-జ్యా-మా. మొ.

**౭౭. ఉవర్ణాంతభిన్నంబు లగు తత్సమస్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు.**

ఉ. సీత. వనిత. భామ. మాత. సీతను. మాతను, మొదలయినవి.

అదంతము లయినఋకారాంతములు-

---

౭౪. బా. త. సూ. ౫౩.

విధాత - విధాతలు.
పిత. పితలు.
భ్రాత. భ్రాతలు. } మొదలగునవి.

అదంతంబు లగుస్త్రీలింగంబుల కెల్ల రూప మిట్లె యుండునది.

ఇవర్ణోవర్ణాంతంబు లగుస్త్రీలింగంబుల కెల్లఁ బూర్వసూత్రంబుల చేతనే రూపనిష్పత్తి సమగ్రంబయ్యెడు.

౪౭. అచేతనవాచకశబ్దంబుల ద్వితీయకుం బ్రథమయుఁ దృతీయాసప్తములకు ద్వితీయయును విభాష నగు.

ఉ. చెట్టెక్కెన్ - చెట్టునెక్కెన్ - కత్తినఁబొడిచెన్. కత్తిచేతఁబొడిచెన్ - కాశినుండెన్ - కాశియందుండెన్. మొ.

౪౮. ఉండిశబ్దము పరం బగుచో వలనకు ద్వితీయాసప్తములగు.

వానినుండి - నిన్నుండి - గృహమునుండి. గృహమందుండి-భూలోకమునుండి.

ఇది యజన్తప్రకరణము

---

## హలన్తప్రకరణము

౫౦. సంస్కృతహలన్తశబ్దము లాంధ్రమునందు దిగాదు లనియు గుణవదాదు లనియు, సుభయేతరంబు లనియుఁ ద్రివిధంబు లయియుండు.

౫౧. దిగాదుల కంతమునందు ద్విత్వోత్వంబు లగు; ప్రథమైకవచనంబు లోపించు.

ఉ. దిక్కు- దృక్కు - కకుప్పు - ఉపానత్తు - పరీక్షిత్తు-ఇంద్రజిత్తు-స్వరాట్టు - విరాట్టు. మొ.

తక్కినవిభక్తులయందలి రూపంబు న్యాగమంబు లేనిమహాత్తుల రూపంబులతోడఁ దుల్యంబు.

ఉ. దిక్కును - స్వరాట్టును. పరీక్షిత్తును. ఇంద్రజిత్తును. మొ.

౧౨. ద్వితీయైకవచనాంతంబు లగు గుణవదాదు లిందు నామంబు లగు. వీనికంత్యలోపం బగు.

అనఁగా ద్వితీయైకవచనముయొక్క మకారంబునకు లోపం బగు నని యర్థము.

ఉ. గుణవంత - బుద్ధిమంత - శ్రీమంత - విద్వాంస శ్వాన - అన డ్వాహ - దుర. మొ.

౧౩. వీనియందు మహ దమహాత్తులకుఁ గ్రమంబున డు ము వర్ణకంబులును స్త్రీలింగంబులకుఁ బ్రథమైక వచనలోపంబును నగు.

ఉ. గుణవంతుఁడు - బుద్ధిమంతుఁడు - శ్రీమంతుఁడు-విద్వాంసుఁడు - శ్వానము - దురము - సంపద - ఆపద. మొ.

౧౪. దిగాదులయందు సాంతజగచ్ఛబ్దంబుల కంత్యలోపంబు విభాష నగు; పయశ్శబ్దంబునకుఁ గాదు.

ఉ. యశము - యశస్సు - శిరము - శిరస్సు - మనము - మనస్సు - తమము - తమస్సు - జగము - జగత్తు ఇత్యాదులు. పయశ్శబ్దంబునకు - పయస్సు అని రూపంబు.

౧౫. ఉభయేతరంబులయందు నాంతంబుల కంత్యలోపం బగు. వీనియందు మహదమహాత్తులకుఁ గ్రమంబుగా డు ము లు విభాష నగు.

దిగాదులు గుణవదాదులు వీనికంటె నితరంబు లుభయేతరంబులు.

ఉ. ఆత్ముఁడు - ఆత్మ - ఆత్మము - జీవాత్ముఁడు - జీవాత్మ - పర

---

౧౦ - ౧౪ - వఱకు బా. క. సూ. ౬౭. ౭౧ వఱకు ననుసంధించునది.

మాత్ముఁడు - పరమాత్మ - సుశర్ముఁడు - సుశర్మ - విష్ణుశర్ముఁడు - విష్ణుశర్మ - సుధన్వుఁడు - సుధన్వ - మూర్ధము - మూర్ధ - కర్మము కర్మ. మొ.

రాజన్ శబ్దమునకు ద్రుతలోపంబును అకారంబునకు ఉకారంబును నగును.

ఉ. రాజు - రాజును - రాజుచేతన్. మొ.

౫౭. తత్సమశబ్దంబులన్నియుఁ బ్రకృతితోడ సమానలింగములు గలవి యగును.

ప్రకృతి యనఁగా మూలమైన సంస్కృతము.

ఉ. రాముఁడు - సీత - కులము. మొ.

ఇది హలన్తప్రకరణము.

---

అచ్చతెనుఁగు ప్రకరణము

౫౮. పుంలింగ సమంబులు స్త్రీలింగ సమంబులు నపుంసకలింగ సమము లని యచ్చతెనుఁగుశబ్దములెల్లం ద్రివిధంబులు.

డువర్ణకాంతంబు లగుమహద్వాచకంబులును మహతీవాచకంబులును దక్కఁ దక్కిన యచ్చతెనుఁగుశబ్దంబులెల్ల మూఁడు తెఱంగులు గలవని తాత్పర్యము.

పుంలింగతుల్యంబులకు డువర్ణకాదులును స్త్రీలింగతుల్యములకుఁ బ్రథమైకవచనలోపంబు మొదలగునవియును నపుంసకలింగతుల్యములకు మువర్ణకంబును నగు నని యెఱుంగునది.

ఉ. కర్తలుఁడు - కయిరఁడు - జన్నుఁడు - పులియఁడు - ఒక్కఁడు - బూచిగాఁడు - తిమ్మయ - గిజిగాఁడు - పోలంగాఁడు - ఒంటిగాఁడు - మొదలుఁగునవి పుంలింగతుల్యంబులు.

అన్న - అబ్బ - అయ్య - తాత - బావ - మామ - గోడ - మేడ - ఊరు - పైరు - బావి - మావి - మేను - కౌను. మొ. స్త్రీలింగతుల్యంబులు.

అల్లము - బెల్లము - మొల్లము - పీయము, ఏయము - కయ్యము - అందము - చందము - గుఱ్ఱము - పల్లము మొ. నపుంసకలింగతుల్యములు.

౨౯. కొన్ని తెలుఁగు మహత్తులకు డువర్ణకాదులు తత్సమంబులకువలె నగు.

ఉ. బల్లిదుఁడు - బల్లిదునిన్ - బల్లిదుర్ - ఓబల్లిదుఁడ - ఓబల్లిద - జెట్టిదుఁడు లోనగునవి యిట్లూహ్యంబులు.

౩౦. పగతుఁడు మొదలగువానికి సంబోధనంబున డువర్ణకంబు నిత్యంబు; బహుత్వంబున లకారంబునకు రేఫం బగు.

ఓపగతుఁడా - పగతురు - అల్లురు - నెయ్యురు - బలియురు. మార్తురు. మొ.

౩౧. మగాదులకును బుంలింగతుల్యంబులకును డువర్ణకాదులు నిత్యంబులు. ఉత్వంబు గలుగదు.

ఆదిపదముచేత నివర్ణకన్యాగమంబులు గ్రాహ్యంబులు.

ఉ. మగఁడు - మనుమఁడు - బావఁడు - మగలు - మనుమలు - బావలు - మగనిన్ - మనుమనిన్ - బావనిన్ - మగనిచేతన్. కత్తెఱఁడు - కత్తెఱనిన్ - పులియఁడు - పులియనిన్ - ఒంటిగాఁడు - ఒంటిగానిన్. మొ.

౩౨. కొన్ని దీర్ఘపూర్వక డువర్ణకాంతంబులకు బహుత్వంబునందు లకారంబునకు రేఫంబును దానికిం బూర్వంబునం బూర్ణబిందువు నగు.

వేటకాండ్రు - ఆటకాండ్రు - విలుకాండ్రు - కన్నడీండ్రు - కవ్వతీండ్రు - మాపటీండ్రు. మొ.

౬3. స్త్రీపరంబు లగునెల్లశబ్దంబులకుం
ప్రథమైకవచనంబునకు లోపం బగు.

ఉదాహరణములుమీఁద వ్రాయఁబడియె.

౬౪. ఆలు మొదలగుశబ్దంబులకు బహుత్వంబునందు లువర్ణంబు
నకుం బూర్ణబిందుపూర్వకడువర్ణంబును ఉకారంబునకు
లోపంబును మీఁదిలకారంబునకు రేఫంబును
నాదేశంబు లగును.

ఉ. ఆండ్రు, జవరాండ్రు, చెల్లెండ్రు, కోడండ్రు, మరదండ్రు.

౬౫. కొన్నిశబ్దంబులకు బహువచనంబు పరంబగునపుడు
ర డ ల లయుదిత్తులకు లోపంబును ర డ ల
వర్ణంబులకు ళకారాదేశమును
దఱచుగ నగును.*

ఏఱు - ఏళ్లు - సీరు - సీళ్లు - గోరు - గోళ్లు - గోరులు - పందిరి - పందిళ్లు - పందిరిలు.

| | | | |
|---|---|---|---|
| త్రాడు | త్రాడులు | త్రాళులు | త్రాళ్లు |
| కోడు | కోడులు | కోళులు | కోళ్లు |
| కీడు | కీడులు | కీళ్లు | |
| లేడి | లేడులు | లేళులు | లేళ్లు |
| పాడి | పాడులు | పాళ్లు | |
| పాలు | పాళులు | పాలులు | పాళ్లు |
| మేలు | మేలులు | మేళ్లు | |

క్షీరవాచకం బగు పాలుశబ్దంబునకు బహువచనంబు లేదు.

---

* తఱచుపదంబు బహుళార్థకంబు.

| | | |
|---|---|---|
| ఆవుపాలు | ఆవులపాలు | |
| నెమలి | నెమళ్లు | నెమళ్లులు |
| అంబలి | అంబళ్లు | అంబళులు |
| కోమటి | కోమట్లు | కోమటులు |
| జెట్టి | జెట్టులు | జెట్లు |
| చెట్టు | చెట్లు | చెట్టులు. మొదలయినవి. |

౬౬. కొన్ని ఇకారాంతనామంబులకు బహువచనంబు పరంబగునపుడు ఉపాంత్యేకారంబునకు నుకారం బగు.

ఉ. బలిమి - బలుములు. చెలిమి - చెలుములు. కలికి - కలుకులు, ములికి - ములుకులు, కొలికి - కొలుకులు. మొ.

కొన్ని యనుటచేత - పందిళ్లు - అంగిళ్లు - ముంగిళ్లు - మొదలగు చోటుల నుత్వంబు లేదు.

౬౭. కొన్ని రువర్ణాంతములకు బహువచనంబు పరం బగుచో నుకారలోపంబు వైకల్పికంబు.

ఉ. పైరులు - పైర్లు - పేరులు - పేర్లు - కార్లు - కోర్లు. చూర్లు. మొ.

౬౮. కొన్ని లివర్ణాంతములకు బహువచనంబు పరంబగుచో నికారలోపంబును లకారంబునకుఁ బూర్ణబిందు పూర్వకడకారంబును నగు.

ఉ. రోకండ్లు. తిరుగండ్లు - గొడ్డండ్లు - అటకండ్లు - పెండిండ్లు. మొ.

౬౯. కొన్ని సంయుక్తలువర్ణాంతములకు బహువచనంబు పరంబగుచో లువర్ణంబునకు పూర్ణబిందు డువర్ణకంబు విభాష నగు. డువర్ణోకారంబునకు లోపంబు వైకల్పికంబు.

ఉ. కొలను - కొలఁకులు - కొలంకులు.

కెలను - కెలఁకులు - కెలంకులు.

మ్రాను - మ్రాఁకులు

జేను - జేఁగులు - గోను - గోఁగులు - చేను - చేలు - పేను - పేలు మీను - మీలు - ఇత్యాదులు.

౨౧. టి - ంటి. ఇ - తి. మొదలగువర్ణంబు లౌపవిభక్తికంబు లనంబడు.

౨౨. ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు నామంబులతుద నుండుడుఙుల్వాదుల కగు.

ఉ. ఏఱు - ఏటిన్ - ఏటికిన్ - ఇల్లు - ఇంటిన్ - ఇంటికిన్ - మూఁడు - మూఁటిన్ - మూఁటికిన్ - చెల్లెలు - చెల్లెలిన్ - చెల్లెలికిన్ - వ్రేలు - వ్రేలిన్ - వ్రేలికిన్ - గోయి - గోతిన్ - గోతికిన్.

ఇత్యాదులయం దాదేశము.

నూఱిటిన్ - రెండింటిన్ - అన్నిటిన్ - నాలుగింటిన్ - ఇత్యాదులయం దాగమంబు.

౨౩. ఔపవిభక్తికాంతంబులమీఁదఁ దృతీయాసప్తమ్యర్థములయం దకారంబు విభాష నగు.

ఉ. ఏటన్ - ఇంటన్ - కంటన్ - పంటన్ - రెంటన్ - మూఁటన్ - నూటన్ - వేయింటన్ - పక్షంబున ఏటిచేతన్ - ఏటియందున్. మొ.

---

అచ్చతెనుగు ౧౮ - ౧౯ సూ. బా. ఆ. సూ. ౧-౨౩ వఱకునను సంధించునది.

౨౪. కొన్ని యుకారాంతంబులకు సప్తమ్యర్థమునం దకారంబగు.

ఉ. ఊరన్ - క్రిందన్ - మీఁదన్ - బయటన్. మొ.

౨౫. ఒకానొకచోట గకారంబునకు వకారంబు విభాష నగు.

ఉ. తొగ - తొవ - పగలు - పవలు - ఈగి - ఈవి.

త్రాగి - త్రావి రాగిమ్రాను - రావిమ్రాను. మొ.

సర్వనామములు

౨౬. అన్ని-ఇన్ని-ఎన్ని-కొన్ని-పెక్కు-పలు-ఆ-ఈ-ఏ నీ నా-తా-మన సంఖ్యార్థకములు సర్వనామంబులు.

౨౭. అన్ని మొదలగు నాలుశబ్దంబులును ఇద్దఱు మొదలగు సంఖ్యావాచకంబులును మహద్వాచకంబు లగునపుడు బహువచనాంతంబులును అమహత్తు లగునపుడు ఏకవచనాంతంబులుగా నగును.

౨౮. న మొదలగు నాలుగుశబ్దంబులు మూఁడులింగముల యందు సమానరూపంబులు సర్వనామంబులయొక్క రూపంబులు పలువిధంబులై యుండుఁ గావున గ్రంథబాహుళ్యభీతిచేత లోకవ్యవహారసిద్ధంబు లగు రూపంబులయందుఁ గొన్నింటిని దిక్ప్రదర్శనార్థంబుగ నుదాహరించెద.

మ - అ - ఇవి మహత్తులు - అమహత్తులు. ఇచట మహదర్థకంబు లన - మహతీమహదర్థకంబు లని యెఱుంగునది.

సర్వార్థకము

మ. అ.

అందఱు ... అన్ని.

ఇదమర్థకము

ప్ర. ఇందఱు ... ఇన్ని.

కియదర్థకము

ప్ర. ఎందఱు ... ఎన్ని.

కతిపయార్థకము

ప్ర. కొందఱు ... కొన్ని.

బహ్వర్థకము

ఇవి ఔపవిభక్తికాంతములుగావున

ద్వి. అన్నిటిన్ ... అన్నింటిన్.
ఇన్నిటిన్ ... ఇన్నింటిన్.
పెక్కిటిన్ ... పెక్కింటిన్.

మొదలగునవి యూహించునది.

అమహత్వంబున దీనికి వ్యస్తప్రయోగంబు లేదు.

మ.

తచ్ఛబ్దార్థకము. ఆ.

ప్ర. వాఁడు... { వారు / వారలు / వాండ్రు

ద్వి. వానిన్.... { వారిని / వారలను / వాండ్రను

అ.

ప్ర. అది. ... అవి
అద్ది ... అవ్వి
ఆయది ... ఆయవి
అయ్యది. ... అయ్యవి.

ద్వి. దానిన్ ... / ఆదానిన్ ... / అద్దానిన్ ... { వానిన్. మొ.

ఇదమర్థకము. ఈ

ప్ర. వీఁడు. ... { వీరు / వీరలు / వీండ్రు

ద్వి. వీనిని... { వీరిని / వీరలను / వీండ్రను

అ.

ప్ర. ఇది ... ఇవి
ఇద్ది ... ఇవ్వి
ఈయది... ఈయవి
ఇయ్యది... ఇయ్యవి.

ద్వి. దీనిన్ – మొదలయినవి.

యత్కిమర్థకము

మ.

| | | |
|---|---|---|
| | ఏవాఁడు ... | ఏవారు |
| | ఎవ్వాఁడు ... | ఎవ్వారు |
| ప్ర. | ఎవ్వఁడు ... | ఎవ్వరు |
| | ఎవఁడు ... | ఎవరు |
| | ఏఁడు ... | ఏరు |

మొదలగునవి.

అ.

| | | |
|---|---|---|
| | ఏది. ... | ఏవి |
| | ఎది ... | ఎవి |
| ప్ర. | ఎద్ది ... | ఎవ్వి |
| | ఏయది ... | ఏయవి |
| | ఎయ్యది... | ఎయ్యవి |
| | దేనిన్. ... | వేనిన్ |
| ద్వి. | ఏదానిన్... | ఏవానిన్ |
| | ఎద్దానిన్... | ఎవ్వానిన్ |

మొ.

తదాదులకుఁ బూజ్యతయందు మహద్వాచకంబులకు అతఁడు - ఆతఁడు, ఇతఁడు-ఈతఁడు, ఎతఁడు - ఏతఁడు అనియుం మహతీవాచకంబులకు ఆపె - ఆమె - ఈపె - ఈమె - ఏపె - ఏమె అనియుం రూపంబులు గలవు.

నీశబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | నీవు, ఈవు ... | మీరు, మీరలు, ఈరు, ఈరలు |
| ద్వి. | నిన్నున్, నినున్ ... | మిమ్మున్, మిమున్ |

మొ.

నాశబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | నేను, ఏను ... | మేము, నేము, ఏము |
| ద్వి. | నన్నున్, ననున్ ... | మమ్మున్, మమున్ |

తాశబ్దము

| | | |
|---|---|---|
| ప్ర. | తాను... | తాము, తారు, తమరు |
| ద్వి. | తన్నున్. ... | తమ్మున్ |
| | తనున్. ... | తమున్ |
| తృ. | తనచేతన్ ... | తమచేతన్ |

మొ.

మనశబ్దము నిత్యబహువచనాంతము

ప్ర. మనము

ద్వి. మనలన్

త్రు. మనచేతన్. మొ.

సంఖ్యావాచకంబులు. ప్ర. ఒక్కఁడు / ఒకఁడు } { ఒక్కరు / ఒకరు.

మహత్వర్థకము. ప్ర. ఒకతె. ఒకర్తె. మొ.

అమహదర్థకము ప్ర. ఒకటి - ఒకఁడు - మొ.

మహతీమహద్వాచకంబులు ప్ర. ఇద్దరు. ముగ్గురు - మొ.

అ. ప్ర. రెండు - మూఁడు.

ద్వి-రెండింటిన్. మొ.

౭౯. అచ్చతెనుఁగునందు విశేషణవాచకంబులకు లింగవిభక్తివచనంబులు లేవు.

ఉ. మంచి - చెడ్డ - తెల్ల - నల్ల - పచ్చ - పుల్ల - తియ్య - కమ్మ మొ.

౮౦. తెనుఁగువిశేషణంబులు విశేష్యంబులతోడ నిత్యంబుగ సమసించును.

ఉ. మంచికార్యము - చెడ్డపని - తెల్లగొడుగు - నల్లత్రాచు - తీయకూర - కమ్మనిల్లు - పుల్లమావి మొ.

౮౧. అనంతగుణవాచకంబు లగువిశేషణంబులకు సమాసమునందు నివర్ణకంబు వైకల్పికంబు.

ఉ. తెల్లనియావు - తెల్లావు. నల్లనిగుఱ్ఱము-నల్లగుఱ్ఱము. ఎఱ్ఱనికెంపు - ఎఱ్ఱకెంపు.

౮౨. తెనుఁగు విశేషణంబులు విశేష్యంబులకు మాఱుగాఁ దచ్ఛబ్దంబుతోడ సమసించును.

ఉ. మంచివాఁడు - చెడ్డవాఁడు - మంచిది - చెడ్డది. కఠినమైన మంచిరాజా. మొ.

౮౩. నామంబులమీఁద భావంబునం దనవర్ణకం బగు.

ఉ. దొరతనము - రాజాతనము - బంటుతనము - మగతనము - ఆడుతనము. మొ.

౮౪. సంబంధంబున దివర్ణకం బగు.

ఉ. రామునిది - కృష్ణునిది - వారిది - వీరిది. మొ.

౮౫. ఇదంతంబు లగుసానీశబ్దవిశేషణంబులకుఁ బ్రథమైక వచనంబుమీఁద ని వి వర్ణకంబులును ఇకారాంతములు కానివిశేషణంబులమీఁద ను వు వర్ణకంబులును వాని బహువచనంబులమీఁద ము రు వర్ణకంబులును క్రింది యుకారంబున కత్వంబును నగు.

నేను తల్లిని - నీవు తండ్రివి - నేను అన్నను - నీవు తమ్ముఁడవు - నేను మనువను - నీవు శంభువవు - నేను చుట్టమను - నీవు చుట్టమవు - మేము తల్లులము - మీరు తండ్రులరు - మేము అన్నలము - మీరు తమ్ములరు. మేము వృద్ధులము మీరు బాలురరు. మొ.

ఇది సుబన్తప్రకరణము.

## విభక్త్యర్థ ప్రకరణము

విభక్త్యర్థప్రకరణ మనఁగాఁ బ్రథమ మొదలగు విభక్తులయర్థములను వానిలక్ష్యములను వివరించునట్టిది.

౮౬. ప్రథమావిభక్తి నామంబులమీఁద స్వార్థంబునందును సంబోధనంబునందును నగు.

ఏశబ్దమున కేది నిశ్చితమైనయర్థమో అదియే స్వార్థంబు.

---

సర్వనామప్రకరణము బా. సూ. ౨౪ - ౩౮ వఱకు (అచ్ఛిక ప్రకరణము) అనుసంధించునది.

ఉ. మనుష్యుఁడు - వనము - పశువు - స్త్రీ.

ఓమనుష్యుఁడ - ఓవనమ. ఓపశువ. మొ.

౮౭. ద్వితీయావిభక్తి కర్మార్థమునం దగు. ధాత్వర్థమైన ఫలమునకు నాశ్రయంబు కర్మం బనఁబడు.

ఉ. కులాలుఁడు - కుండను - చేసెను - మొ.

౮౮. చేత చే, తృతీయలు, కర్తృకరణార్థములయందును హేత్వర్థంబునందును నగు.

ధాత్వర్థమైనవ్యాపారమున కాశ్రయమైనది కర్త యనంబడు. క్రియ సిద్ధించుటకు ముఖ్యకారణ మగునది కరణం బనఁబడు. ఫలమును సాధించుటకుఁ దగినపదార్థము హేతు వనంబడు.

కర్త్రర్థకము.

ఉ. రాజులచేతఁ బగతురు చంపఁబడిరి.

కాఁపులచేతఁ బొలములు దున్నఁబడియె.

కత్తిచేత నరికెను. ఒకబాణముచేతఁ జంపెను.

హేతువునకు

ఉ. ధనముచేత సుఖము కలుగును.

యోగ్యతచేత గౌరవము కలుగును.

౮౯. తోడ తో తృతీయలు కరణసహార్థములయందును తుల్యార్థకశబ్దయోగంబునందును నగు.

సహార్థ మనఁగాఁ గలసియుండుట. తుల్యార్థశబ్దములు తుల్య - సమాన - సదృశ. మొ.

కరణమునకు

కత్తితోడ నరికెను - ఈటెతోఁ బొడిచెను.

సహార్థమునకు

భర్త భార్యతోడ వచ్చెను. తండ్రి కొడుకుతోడ వచ్చెను.

తుల్యార్థమునకు

రామునితోడ రంగఁడు తుల్యుఁడు. సమానుఁడు. సదృశుఁడు. మొ.

౮౦. చతుర్థీవిభక్తి సంప్రదానంబునం దగు.

సంప్రదానంబునఁ దనవ్యాపారముచేత సంబంధించుటకుఁ గోరఁబడు పదార్థము.

ఉ. వరునికొఱకుఁ గన్యక నిచ్చెను.

ముక్తికొఱకు దేవుని సేవించెను. ఇట్టు కయిదువును.

౮౧. పంచమీవిభక్తి అపాదానార్థంబునం దగు.

ఒకవస్తువునుండి మఱియొకవస్తువు విడిపోవునప్పుడు మొదటిది యపాదానం బనంబడు.

ఉ. చెట్టువలనఁ బాదు పడియె. రాజు రాజ్యమువలన భ్రష్టుం డయ్యె. ఈవలనవర్ణకమునకే ఉండిపదం బను ప్రయుక్తం బగును.

రాజు రాజ్యమువలననుండి భ్రష్టుఁ డయ్యెను.

౮౨. పంచమీవిభక్తియందు కంటెవర్ణకంబు న్యూనాధికాద్యర్థయోగంబున నగు.

అనఁగా తక్కువ హెచ్చు మొదలగునర్థములు గలశబ్దములతోడ సంబంధము గల నామముమీఁదఁ గంటె యనువర్ణకంబువచ్చు నని భావము.

ఉ. వీఁడు వానికంటె నీచుఁడు. మొ.

౮౩. షష్ఠీవిభక్తియందు కినుయొక్కవర్ణకములు సంబంధార్థమునం దగు.

సంబంధార్థ మనఁగా స్వస్వామిభావాదికము. ఉ. అతనికి తమ్ముఁడు. నాకు తండ్రి. రాముని యొక్క పుత్రుఁడు మొ.

౯౪. షష్ఠీవిభక్తియందు లో లోపల వర్ణకంబులు నిర్ధారణార్థమునం దగు.

నిర్ధారణ మనఁగా సమూహమునం దొకపదార్థమును నిర్ణయించుట.
ఉ. మనుష్యులలోపల విద్వాంసుఁడు పూజ్యుఁడు. మొ.

౯౫. సప్తమీవిభక్తి అధికరణార్థమునం దగు.

అధికరణం బనఁగా ఒకదానిని ఉంచుటకు నాధారం బగునది.
ఉ. చెరువునందు జలము ఉన్నది.

ఇది విభక్తిప్రకరణము.

---

## సమాసప్రకరణము

౯౬. తత్పురుష ద్వంద్వ బహువ్రీహు లని సమాసంబు లెల్లం ద్రివిధంబులు. అనేకపదంబు లేకపదం బగుట సమాసంబు.

అందు ఉత్తరపదార్థప్రధానము - తత్పురుషము. ఉభయపదార్థప్రధానము - ద్వంద్వము. అన్యపదార్థప్రధానము - బహువ్రీహి.

౯౭. సమానవిభక్తికం బనియు నసమానవిభక్తికం బనియుఁ దత్పురుషంబు ద్వివిధంబు.

౯౮. తుల్యంబు లగువిభక్తులు కలది సమానవిభక్తికంబు. ఇదియే కర్మధారయంబు.

౯౯. భిన్నవిభక్తులు గలది యసమానవిభక్తికంబు.

---

౪౬ - ౯౫ - బా. కా. ౧ - ౩౪ - తో సరిపోల్చునది.

ఇదియే వ్యధికరణ తత్పురుషము.

౧౦౦. సమాసపదంబుల విభక్తులకు లోపం బగు.

౧౦౧. విశేషణం బగు ప్రథమాంతపదమునకు విశేష్యం బగు ప్రథమాంతపదముతోడి సమాసము కర్మధారయం బగు.

ఉ. వాడియమ్ములు. వేఁడికిరణములు. మొ.

౧౦౨. ద్విగువు మొదలగునవి కర్మధారయవిశేషంబులు.

ఉ. ముచ్చిచ్చు - మువ్వన్నె - ముజ్జగములు. ద్విగుసమాసంబులు.

రాచసింగము. ఉపమానోత్తరపదము. చెక్కుటద్దము - రూపకము.

౧౦౩. ద్వితీయాదివిభక్తులకు ప్రథమాంతములతోడి సమాసము వ్యధికరణతత్పురుషము.

ఖుడుత నెలను తాల్చు - ఖుడుత నెలదాల్పు. ద్వితీయాతత్పురుషము.

నెలచేతఁ దక్కువవాఁడు - నెలతక్కువవాఁడు. తృ. తత్పురుషము.

దొంగవలనభయము - దొంగభయము. పం. తత్పురుషము.

మల్లెయొక్క పువ్వు - మల్లెపువ్వు. ష. తత్పురుషము.

మాటయందు నేర్పరి - మాటనేర్పరి. స. తత్పురుషము.

౧౦౪. విశేష్యంబు లగు ప్రథమాంతపదముల సమాసము ద్వంద్వం బగు.

ఉ. అన్నదమ్ములు - తల్లిదండ్రులు. మొ.

౧౦౫. అన్యపదార్థబోధకం బగు ప్రథమాంతము గల సమాసము బహువ్రీహి యగు.

---

౧౦౨. చూ. బా. స. సూ. ౧౯.

ఉ. ముక్కంటి. చలివెలుఁగు - ఇత్యాదులు.

౧౦౬. తెనుఁగునం దనేకపదంబులు వానివానివిభక్తివికారంబులతోఁడ యథాయోగ్యములుగా సమసించును.

ఉ. అలరువిల్తునికఱకుటంపరపెంపు-

తెలిదమ్మికంటియిల్లాలికడకంటిచూపు- మొదలైనవి.

ఇది సుబన్తపరిచ్ఛేదము.



౧౩౫. చూ. బా. స. సూ. ౨౨.

# క్రియాపరిచ్ఛేదము



౧. వ్యాపారవాచకములు క్రియలు.

౨. తత్సమంబు లనియు దేశ్యంబు లనియుఁ గ్రియ లిఱుదెఱంగు లయి యున్నవి.

3. పోషించు - నుతించు - స్తుతించు - మోదించు మొదలగునవి తత్సమక్రియలు. కొట్టు - పెట్టు - వండు - మొదలగునవి దేశ్య క్రియలు.

౪. వర్తమానార్థకము అనియు భూతార్థకము అనియు భవిష్యదర్థకము అనియుఁ దద్ధర్మార్థకము అనియుఁ గ్రియలు కాలవాచకంబు లగును.

వర్తమానం బన జరుగుచున్న కాలము.

భూతం బనఁ గడచినకాలము.

తద్ధర్మంబన వర్తమానాదికాలత్రయ సాధారణకాలము.

౫. వ్యతిరేకార్థము ప్రార్థనార్థము తుమున్నర్థము సత్యర్థము చేదర్థము ఆనంతర్యార్థము మొదలగుకొన్నియర్థములు కలవు. వ్యతిరేక మనఁగాఁ గ్రియయొక్క అభావము. ప్రార్థన యనఁగా వేఁడుట.

౬. క్రియలమీఁద వచ్చునేకవచనబహువచన ప్రత్యయంబులు పురుషంబు లనంబడు.

౭. మూఁడుపురుషములు క్రమంబుగఁ బ్రథమమధ్యమోత్తమ పురుషంబులు.

౮. నాశబ్దార్థంబు కర్త యగునపుడు క్రియలమీఁద నుత్తమపురుషం బగు.

౯. నీశబ్దార్థంబు కర్త యగునపుడు క్రియమీఁద మధ్యమపురుషం బగు.

౧౦. ఇతరంబు కర్త యగునపుడు ప్రథమపురుషం బగు.

౧౧. తత్సమక్రియలకు స్వార్థమునందును ప్రేరణార్థమునందును ఇంచుక్ ఆగమం బగు.

స్వార్థం బనఁగా నిచట ధాత్వర్థము.

ప్రేరణం బన నితరులచేతఁ బనిచేయించుట.

౧౨. దేశ్యక్రియలకుం బ్రేరణార్థమునందే ఇంచుక్కు వచ్చును.

౧౩. క్రియలమీఁద వర్తమానంబున చువర్ణకం బగు.

౧౪. అనుబంధప్రార్థన ప్రేరణావ్యతిరేక తుమున్నర్థకములు పరం బగునపు డించుచకారంబునకు పకారం బగు.

౧౫. మహత్తు కర్త యగునపుడు వర్తమానభవిష్యద్వ్యతిరేకంబులయందుఁ బ్రథమపురుషైకవచనంబు బిందుపూర్వకడువర్ణకంబును ఉన్నకు దీర్ఘంబును నగు.

౧౬. క్రియలకుఁ బ్రథమమధ్యమపురుషబహువచనంబు రువర్ణకం బగు.

| తత్సమము. | దేశ్యము. |
|---|---|
| పోషింపుచున్నాఁడు. | కొట్టుచున్నాఁడు. |
| పోషింపుచున్నారు. | కొట్టుచున్నారు. |

౧౭. అమహత్తు కర్త యగునపుడు క్రియలకు వర్తమానంబున దివివర్ణకంబులును భవిష్యదవ్యతిరేకంబులయందు దువువర్ణకంబులును డురుల కాదేశంబు లగును.

ఉ. నుతింపుచున్నది నుతింపుచున్నవి.

పెట్టుచున్నది పెట్టుచున్నవి.

మధ్యమోత్తమపురుషంబులయం దలిరూపంబు మహత్తు కర్త యగునపుడును అమహత్తు కర్త యగునపుడును సమానంబు.

౧౮. వర్తమానము మొదలగు నన్ని కాలములయందును మధ్యమపురుషైకవచనంబు వువర్ణకం బగు.

ఉ. స్తుతింపుచున్నావు. స్తుతింపుచున్నారు

వందుచున్నావు వందుచున్నారు.

౧౯. అట్లు ఉత్తమపురుషైకవచన బహువచనంబులకును మువర్ణకంబు లగు.

ఉ. మోదింపుచున్నాను మోదింపుచున్నాము.

కట్టుచున్నాను కట్టుచున్నాము.

౨౦. క్త్వార్థభూతార్థములయందు క్రియాంత్యవర్ణంబున కిత్వం బగు.

క్త్వార్థం బనఁగా నేకాశ్రయ మయిన క్రియలలోపలఁ బూర్వకాలిక క్రియాబోధక మయినయర్థము.

౨౧. భూతతద్ధర్మంబులయందుఁ బ్రథమపురుషైకవచనంబునకు లోపంబగును. అగుచో భూతంబునఁ గ్రియాంత్యంబున కిత్వంబగును.

౨౨. మధ్యమోత్తమపురుషంబులు పరంబులగుచో
భూతంబునం గ్రియలమీఁద తి-వర్ణకంబగును.

౨౩. భూతక్రియలమీఁది పురుషముల యుకారంబున
కిత్వంబగును.

౨౪. భూతక్రియలమీఁది మధ్యమైకవచనంబునకు
లోపంబు విభాషనగు.

ఉ. హర్షించెన్ { హర్షించితివి { హర్షించితిని
హర్షించిరి. { హర్షించితి { హర్షించితిమి.
{ హర్షించితిరి.

తెచ్చెన్ { తెచ్చితివి తెచ్చితిని
తెచ్చిరి { తెచ్చితి తెచ్చితిమి.
{ తెచ్చితిరి.

౨౫. వ్యతిరేక భవిష్యత్తుమువాద్యర్థంబులయందుఁ గ్రియల
యంత్యాకారంబున కత్వంబగు. భవిష్యదాదులయత్వంబు
ద్రుతాంతంబగు.

౨౬. భవిష్యదర్థంబునం గ్రియలమీఁదఁ గలాను బంధంబగు.

ఉ. జయింపఁగలఁడు జయింపఁగలరు.
జయింపఁగలదు జయింపఁగలవు.
ఇవ్వఁగలఁడు ఇవ్వఁగలరు
ఇవ్వఁగలదు ఇవ్వఁగలవు.

౨౭. తద్ధర్మార్థమునం డు రు మొదలగు పురుషంబులు
పరంబులగు నపుడు క్రియమీఁద దువర్ణంబగు.

౨౮. దువర్ణంబు పరంబగుచో నించు చువర్ణంబునకులోపంబు

ను దకారంబునకు తకారంబును విభాష నగు.

| | | |
|---|---|---|
| ఉ. ఆశ్రయించున్ | ఆశ్రయింతువు | ఆశ్రయింతును |
| ఆశ్రయింతురు | ఆశ్రయింతు | ఆశ్రయింతుము |
| | ఆశ్రయింపుదువు | ఆశ్రయింపుదుము |
| | ఆశ్రయింపుదు | ఆశ్రయింపుదుము. |

| | | |
|---|---|---|
| పొందున్ | పొందుదువు | పొందుదును |
| పొందుదురు | పొందుదు | పొందుదుము. |
| | పొందుదురు. | |

౨౯. తద్ధర్మార్థంబునం గ్రియాంత్యవర్ణంబున కిత్వంబును ప్రథమపురుషైకవచనంబునకు ద్రుతాంతములగు డుడివర్ణకంబులును దక్కంగల వచనంబులు పరంబులగుచోఁ దువర్ణంబున కత్వంబును విభాష నగు.

3౦. మధ్యమ పువర్ణంబునకు లోపంబగుచోఁ గ్రింది అకారంబున ఉత్వంబగు.

| | | |
|---|---|---|
| ఉ. అనుభవించెదున్ | అనుభవించెదవు | అనుభవించెదను |
| అనుభవించెడిన్ | అనుభవించెదు | అనుభవించెదము |
| అనుభవించెదరు | అనుభవించెదరు | ఇత్యాదులు. |

3౧. ప్రార్థనార్థకమధ్యమ పురుషలకు ముడులాదేశంబు లగు.

డువర్ణకంబు బిందుపూర్వకంబు.

3౨. హల్లుపరంబగునపుడు ముఃలోపంబు విభాషనగు.

ఉ. పరిభవింపుము } తినుము
పరిభవింపు } తిను
పరిభవింపుఁడు } తినుఁడు.

33. ప్రార్థనార్థకమధ్యమ పురుషంబుమీఁద అ-ఆ-ఇ-ఈ అయ్య అమ్మ-లు విభాష నను ప్రయుక్తంబు లగు.

ఉ. అనుభవింపుమ
అనుభవింపుమా
అనుభవింపుమి
అనుభవింపుమీ
అనుభవింపుమయ్య
అనుభవింపుమమ్మ.
} ఇట్లు బహువచనంబునందును.

34. ఉభయకర్తృకప్రార్థనంబున మువర్ణకంబు పరంబగు నపుడు క్రియమీఁద తవర్ణకం బగు. చులోప

తకారంబులుః తద్ధర్మంబున ట్లగు.

ఉ. పరిభవింతము. మోయుదము } మొ.
పరిభవింపుదము మోతము

వ్యతిరేకార్థము.

సంభవింపఁడు రోయఁడు
సంభవింపదు రోయదు
సంభవింపరు రోయరు
సంభవింపవు. రోయవు మొ.

35. వ్యతిరేకంబున మధ్యమపురుషంబు మీఁద ఎ-ఏ-ఒ-ఓ-అయ్య-అమ్మ అనునవి ప్రార్థనయం దనుప్రయుక్తంబు లగు.

ఉ. భరింపవి. భరింపవొ. భరింపవమ్మ.
భరింపవే. భరింపవో. భరింపవయ్య.

బహువచనంబున నిట్లగు.

36. వ్యతిరేక ప్రార్థనయందుఁ గ్రియలమీఁదఁ కువర్ణం బగు. ముువర్ణకంబు ప్రార్థనయందువలె నెలుంగునది.

ఉ. వరింపకుము రోయకుము
వరింపకు రోయకు
వరింపకుఁడు రోయకుఁడు

ఇచటను అ ఆ మొదలగునవి యనుప్రయుక్తంబు లగును.

ఉ. వరింపకుమ
వరింపకుమా } మొదలగునవి.
వరింపకుఁడా.

37. క్రియలమీఁద భావార్థమునందు ట వర్ణకంబును, వ్యతిరేక భావార్థమునందు మివర్ణకంబును నగు.

38. భావార్థకాది క్రియా యోగంబునఁ గర్తకుం బ్రథమ యగు.

ఉ. వాఁడు - హరించుట } వీఁడు సేయుట } మొ.
- హరింపమి } సేయమి }

క్రియానిష్పన్నంబులగు నవ్యయంబులు.

క్త్వార్థము.

క్త్వార్థం బన నిట్టిది యని ముందు నిర్వచింపంబడియె. చూ. సూ. ౨౦.
క్త్వార్థభూతార్థ యను (౨౦) సూత్రముచేత విశారము రాఁగా.

పోషించి వండి మొదలగు రూపము లగుచున్నవి. ఇవియ భూత క్రియాకాంక్షాసమాపక మనఁబడును.

౩౯. వ్యతిరేకత్వార్థంబునఁ గ్రియలమీఁద కవర్ణకంబగు.

ఉ. భరింపక - చేయక - వండక. మొ.

తుమున్నర్థకము.

తుమున్నర్థ మనఁగా నొక క్రియకు మఱియొక క్రియ హేతువై యుండుట. ఈయర్థమునందుఁ గ్రియలమీఁద వ్యతిరేకభవిష్యత్తనుసూత్రముచేత (చూ. సూ. ౨౫) ద్రుతాంతమయిన అకార మాదేశమగును.

ఉ. వాఁడు ఆకార్యమును చేయన్ వచ్చెను.

ఉ. రాజు శత్రువులను సంహరింపన్ వెడలెను. ఇచట వచ్చెను వెడలెను అను క్రియలకు చేయుట సంహరించుట. అను క్రియలు హేతువులని యెఱుఁగునది.

ఒక క్రియకు ఫలమైన క్రియయును హేతువనఁబడును గావున నదియుఁ దుమున్నర్థ మగును.

ఉ. వాఁడు భజింపన్ వచ్చెను. వీఁడు గణింపన్ ఏఁగెను. ఇచట భజించుట గణించుటయను క్రియలు పై క్రియలకు ఫలము లని యెఱుఁగునది.

౪౦. తుమున్నర్థకం బగు క్రియ భావబోధకంబును నగు. భావం బనఁగా ధాత్వర్థము.

ఉ. వాఁడు రా లేదు. వీఁడు - పో లేదు. మొ. ఆతఁడు ఇక్కడ నుండ లేదు - వాఁడు ఆపని చేయ వచ్చును. మనము ఈపని చేయ రాదు. ఇచట రాన్ పోన్ ఉండన్ చేయన్ ఇవి భావార్థకములు. వచ్చుట పోవుట ఉండుట చేయుట అని యర్థము.

౪౧. సత్యర్థంబున ధాతువునకుఁ గా ననుప్రయుక్తంబగు; అది విభాషను గుఱుచ యగు.

సత్యర్థం బన నొక క్రియ మఱి యొక క్రియను సూచించుట. ఈయర్థంబున వ్యతిరేకభవిష్యత్తనుసూత్రముచేత (సూ. ౨౫) ధాతువున కత్వంబు ద్రుతాంతంబు రాఁగా దానిమీఁద కాన్ - అనుప్రయుక్తం బగును.

ఉ. దమయంతి నలుని వరింపఁగాన్ దేవతలు సూచిరి. వరింపుచుండఁగా దేవతలు సూచిరి యని యర్థము. ఇట్లు వరింపఁగన్. మనంగాన్. మనంగన్. మొ.

**౮౨. సత్యర్థంబున ధాతువు వర్తమానకాలబోధకంబునునగు. అప్పుడు తుమున్నర్థకరూపంబులయిన ఉండు. అగు ధాతువులు అనుప్రయుక్తంబు లగును.**

ఉ. వాఁడు వచ్చుచుండఁగా నేను చూచితిని.

**౮౩. ఆనంతర్యార్థంబున ధాతువునకు ద్రుతాంతంబయిన డువర్ణకం బగు. ఆనంతర్యం బనఁ గ్రియ జరిగిన వెంబడికాలము.**

ఉ. రాముఁడు వచ్చుడున్ రంగఁడు చనియెను. రాముఁడు వచ్చిన తోడనే రంగఁడు వెడలె నని యర్థము.

ఇట్లు రంజిల్లుడున్ - చేయుడున్. పెట్టుడున్. కట్టుడున్. మొ.

**౮౪. చేదర్థంబున ధాతువుమీఁద ద్రుతాంత మయిన నివర్ణకంబును ధాతువున కిత్వంబును నగు.**

చేదర్థం బనఁగా నొకక్రియకు హేతువగు మఱియొక క్రియయొక్క నివృత్తి సందిగ్ధం బగుట: అనఁగా హేతు వగు క్రియ యప్పటికిఁ బుట్టక యుండుట.

ఉ. వానలు గురిసినఁ బయిరులు పండును.-ఇచ్చట గురియుటయను క్రియ సందిగ్ధమయి యున్నది. ఇట్లు ధరించినన్-చేసినన్-కొట్టినన్ - కట్టినన్. మొ.

**౮౫. చేదర్థంబునం గ్రియాపదంబులమీఁద ఏనిపదంబును ననుప్రయుక్తం బగును.**

ఉ. వాఁడువచ్చెనేని - నీవు వచ్చితివేని - నేను చేసితినేని - ఇట్లు వచ్చునేని, వత్తువేని, వచ్చుచున్నాఁడేని, చేయఁగలఁడేని. మొ.

---

చూ. బా. క్రి. ౧ - ౧౧౨ సూత్రములను పరిశీలించునది.

విశేషణక్రియలు

వర్తమానార్థకవిశేషణము: పోషించుచున్న, వండుచున్న.

విశేషణంబగు భూతక్రియకు నవర్ణకం బగు: పోషించిన, వండిన.

భవిష్యదర్థ విశేషణంబు - పోషింపఁగల.

**౮౬. తద్ధర్మ ప్రథమపురుషైకవచనంబులు గళ లగుచుఁ దద్ధర్మ విశేషణంబు లగు.**

ఉ. విహరించు - విహరించెడు - విహరించెడి.

**౮౭. విశేషణం బగు వ్యతిరేక క్రియమీఁద నివర్ణకం బగు.**

ఉ. చేయని, వండని.

**౮౮. విశేషణ క్రియలు విశేష్యంబులతోఁడ నేనియుఁ దచ్ఛబ్దంబుతోఁడ నేనియు నిత్యంబుగ సమసించును.**

వీనికి వ్యస్తప్రయోగము లేదనుట.

| | | |
|---|---|---|
| ఉ. చేయుచున్న మనుజుఁడు | చేయనిపనులు | చేసిన వాఁడు |
| చేసిన మనుజుఁడు | చేయువాఁడు | చేయనిది |
| చేసెడు కార్యములు. | | చేసినది. |

**౮౯. క్రియలకుఁ గర్మార్థమునందుఁ బడుశబ్దం బనుబంధంబగు. తక్కుఁగార్యంబులన్నియుఁ గర్త్రర్థంబు నట్లగు.**

ఉ. పోషింపఁబడుచున్నాఁడు

పోషింపఁబడుచున్నది.

**౯౦. భూతార్థ ప్రథమ పురుషైకవచనంబు పరంబగునపుడును తద్ధర్మార్థక రూపాంతరమునందును, పడు ఉకారంబున కియాదేశంబు విభాష నగు.**

ఉ. దండింపఁబడియెన్. దండింపఁబడెన్.

శోధింపఁబడియెదన్ శోధింపఁబడెన్.

శోధింపఁబడియెదరు. శోధింపఁబడెదరు.

ప్రేరణార్థము.

తత్సమక్రియలకుఁ బ్రేరణార్థంబున నించుకాగమముమీఁద షుటిడియొక ఇంచుక్కగు. దేశ్యక్రియలకు నొక్కఁయించుక్క యగును.

అనుబంధాదికార్యములు పూర్వం బట్లగు.

ఉ. భరింపింపుచున్నాఁడు } చేయింపుచున్నాఁడు
భరింపించెన్. } చేయించెన్. మొ.

**౫౧. వ్యాపారఫలంబు కర్తను జెందునపుడు ధాతువునకుఁ గొనుధాతు వనుప్రయుక్తం బగు.**

**౫౨. కొనుధాతువు పరంబగుచో ధాత్వంతమున కిత్వంబు వైకల్పికంబు.**

ఇదియ యాత్మనే పదార్థకంబు.

అలంకరించుకొనుచున్నాఁడు.

అలంకరించికొనుచున్నాఁడు.

ప్రేరణార్థకము - కర్మార్థకము.

పోషింపఁబడియెన్.

ప్రేరణాత్మనేపద కర్మార్థకము.

పోషింపించు కొనఁబడియెన్.

వండించు కొనఁబడియెన్.

**౫౩. అధాతువును ధాతువుంజేయం దలంచుచో దానిమీఁద నించుకాగమంబగు.**

ధాతువగుటకు నర్హాంబగు నితరశబ్దంబులమీఁద నించు క్కడిన నట్టి తత్సమదేశ్యశబ్దంబులును ధాతువు లగు నని యర్థము.

అస్తమ్ - అస్తమించెన్. మొ.

౨౪. తిర్యక్కులు నచేతనంబులును గర్తలగునపుడు భూత తద్ధర్మంబుల ప్రథమపురుష బహువచనం బేకవచనం బగు.

ఉ. పశువులు వచ్చెన్. పక్షులు వ్రాలెన్. వనములు పూచెన్. చేలు పండెన్.

౨౫. లఘువు ఆదియందుఁ గలవియు, ఆయంతములు కానివియు నగు కొన్ని తత్సమక్రియలయం త్యాకారంబున కిత్వంబు వైకల్పికంబు.

ఉ. ఘటియించున్. నటియించున్.

వచియించున్. ఇత్యాదులు.

౨౬. కొన్ని యకర్మకక్రియలమీఁది స్వార్థకమయిన ఇంచుకున్నకు ఇల్లగు.

ఉ. రంజిల్లెన్, ఘటిల్లెన్.

శబ్దపల్లవధాతువులకు.

ఆపటిల్లున్ - నివ్వటిల్లున్ - సొమ్మసిల్లున్.

౨౭. లకారంబున కద్విత్వంబు నగు.

ఉ. రంజిలెన్ - ఆపటిలెన్.

౨౮. రంజాది తత్సమధాతువులకుం బ్రేరణంబున స్వార్థకంబగు నించుకున్నకు లోపంబగు.

ఉ. రాజు రంజిల్లెను. రాజు ప్రజల రంజించెను. మొ. ప్రజల రంజిల్లునట్లు చేసె ననియర్థము.

౫౯. క్రియాపదంబులమీఁద నేకారాకారంబులు ప్రశ్నద్యోతకములును నోకారంబు సంశయద్యోతకంబునుగా నగు.

ఉ. నన్నుఁ బిలిచితివే. నన్నుఁబిలిచితివా. కలదో, లేదో.

౬౦. దీవించుటయందు ధాతువుమీఁద నెడు త వర్ణకంబులు ద్రుతాంతము లగు.

ఉ. పోషించుతన్ - కొట్టుతన్. మొ.

౬౧. అయ్యర్థంబునఁ దద్ధర్మక్రియమీఁదఁ గాత కావుత కాకలు ద్రుతాంతము లగు.

ఉ. దేవతలు రక్షింతురుగాతన్. పోషింతురుగావుతన్. కాతురుగాకన్.

౬౨. యువర్ణాంతములగు దేశ్యక్రియలకు ఇ ఎను కొనులు పరంబులగునపుడు యకారంబునకు సకారంబగు.

ఉ. చేయుం - చేసి - చేసిరి. చేసినన్-చేసెదరు. చేసికొనుచున్నాఁడు.

ఇట్లు నేయుం, మేయుం, వ్రేయుం, రోయుం, పాయుం, మ్రోయుం. మొ.

౬౩. వీనికిం దద్ధర్మార్థమునందు యువర్ణలోపంబును దకారంబునకు తకారంబును విభాషనగు.

ఉ. చేతురు - నేతురు - పక్షంబున చేయుందురు మొదలగునవి.

౬౪. కొన్ని చువర్ణాంతములకు చు లోపత కారంబులు నిత్యంబులు.

| | | |
|---|---|---|
| ఉ. చూచు. | చూతువు - | చూతురు. |
| నేర్చు. | నేర్తువు | నేర్తురు |
| | నేతువు | నేతురు. |

## ౬౨. వర్ణాగమంబు విశేషంబు.

దేశ్యక్రియలకు వ్యతిరేకాద్యర్థములయందుఁ బూర్వోక్తలక్షణముల కవిషయములైన పలుతెఱంగులగు రూపభేదంబులు వర్ణవిశేషాగమాదేశలోప ప్రాప్తిచేతం గలుగు నని యర్థము.

మార్గదర్శనార్థంబుగఁ గొన్నింటి నుదాహరించెద.

వచ్చుధాతువు -వ్యతిరేకము. రాఁడు. రారు

భవిష్యత్తు - రాఁగలఁడు రాఁగలరు.

రాక - రామి - రాక్ - వత్తుము. మొ.

ప్రేరణంబున

రావించుచున్నాఁడు. రప్పించుచున్నాఁడు. రావింపఁడు. రప్పింపఁడు. మొ.

అగు ధాతువు - భూతార్థకము.

అయ్యెన్. ఆయెన్. అయిరి.

వ్యతిరేకార్థకము.

కాఁడు - కారు.

భవిష్యత్తు. కాఁగలఁడు - కాఁగలరు.

తద్ధర్మము - అగున్. అవున్. ఔన్.

అగుదురు. అవుదురు. ఔదురు

అయ్యెడున్. అయ్యెదరు.

ప్రార్థన - కమ్ము - కండు

అగుము. అగుఁడు.

వ్యతిరేకప్రార్థన - కాకుము - కాకుఁడు.

ఉభయప్రార్థన - అగుదము.

భావార్థాదులయందు - అగుట. అవుట. ఔట. కామి - అయి, కాక, అయినక్ - తక్కినరూపంబుల పైఁ దూహించునది.

ఇచ్చుధాతువు వ్యతిరేకార్థము

ఇవ్వఁడు - ఇయ్యఁడు - ఈఁడు
ఇవ్వదు - ఇయ్యదు - ఈదు.

భవిష్యత్తు.

ఇవ్వఁగలఁడు. ఇయ్యఁగలఁడు - ఈఁగలఁడు.

ప్రార్థనార్థకము.

ఇమ్ము. ఇండు. ఇవ్వకుము. ఇయ్యకుము. ఈకుము.
ఇవ్వకుఁడు. ఇయ్యకుఁడు. ఈకుఁడు.

ఉభయప్రార్థన.

ఇత్తము.

తుమున్నర్థములు. ఇవ్వన్ - ఇయ్యన్ - ఈన్.
ఇవ్వక - ఇయ్యక. ఈక. వ్యతిరేకక్త్వార్థకము
ఇవ్వమి. ఇయ్యమి. ఈమి. వ్య. భా.

ప్రేరణార్థకము.

ఇప్పింపుచున్నాఁడు - ఇప్పించుచున్నారు - మొ.

చచ్చు ధాతువు.

వ్యతిరేకార్థకము - చావఁడు. చావరు.
భవిష్యత్తు. చావఁగలఁడు. చావఁగలరు.

ప్రార్థనార్థకము. చావుము-చావుఁడు.
చావకుము - చావకుఁడు.

తుమున్నర్థకము. చావన్. చాన్. మొ.

చూచు ధాతువు.

చూడఁడు - చూడఁగలఁడు - చూడుము - చూడకుము.

ప్రేరణార్థకములందు.

చూపు - చూపించు - అని ధాతురూపంబులు.

ఉ. చూపుచున్నాఁడు - చూపించుచున్నాఁడు. మొ.

చొచ్చు ధాతువు

వ్యతిరేకాద్యర్థములు

ఉ. చొరఁడు - చొరరు.

చొరుము - చొరుఁడు.

చొత్తుము

చొరను. చొరము. మొ.

ప్రేరణార్థకము.

చొప్పించుచున్నాఁడు - చొప్పింపుచున్నారు. మొ.

నొచ్చు ధాతువు. వ్యతిరేకాద్యర్థకములు.

నొవ్వఁడు. నోవఁడు. నొవ్వరు - నోవరు. మొ.

ప్రేరణార్థకము.

నొంచుచున్నాఁడు - నొంపుచున్నాఁడు. నొప్పించుచున్నాఁడు. మొ.

తెచ్చు ధాతువు

వ్యతిరేకార్థకము.

తేఁడు - తేరు; తేదు - తేవు.

ప్రార్థన

తే. తెమ్ము - తెండు.

తేకు - తేకుము - తేకుఁడు.

తుమున్నర్థకము - తేన్.

క్త్వార్థకము - తేఁగాన్. తేఁగన్.

వ్యతిరేకభావార్థకము - తేమి.

ప్రేరణార్థకము.

తెప్పించుచున్నాఁడు - తెప్పించుచున్నారు. మొ.

ఉండుధాతువు వర్తమానార్థకము. ఉన్నారు. ఉన్నాఁడు. మొ.

రూపాంతరము.

కలఁడు - కలరు.

భూతార్థకము.

మ. ఉంటివి. ఉంటిరి.

ఉ. ఉంటిని - ఉంటిమి.

వ్యతిరేకార్థకము.

ప్ర. లేఁడు. లేరు - లేదు - లేవు.

మ. లేవు - లేరు.

ఉ. లేను - లేము.

వ్యతిరేక భావార్థకము. లేమి.

వ్యతిరేకక్త్వార్థకము. లేక.

వ్యతిరేక విశేషణము. లేని.

ఇట్టి రూపభేదంబులు దేశ్యక్రియలయందు దర్థవిశేషంబులయందుఁ బెక్కులు గలిగియున్నవి. గ్రంథవిస్తరభయంబుచేతఁ గొన్నింటికిమాత్రము గొన్నిరూపభేదంబులు వక్కాణింపఁబడియె.

౬౬. ఏకక్రియాన్విత పదసముదాయవాక్యంబును కేవలపద సముదాయవాక్యంబును నని వాక్యంబు ద్వివిధంబు.

ఏకక్రియాన్విత పదసముదాయవాక్యము.

రాజు శత్రువులను సంహరించెను.

కేవలపదసముదాయవాక్యము :

వచ్చెఁడువాఁడు రాముఁడు.

౬౭. కర్త్రర్థకము - కర్మార్థకము నని ప్రయోగము ద్వివిధంబు.

కర్తను ప్రధానముగాఁ గలది కర్త్రర్థకము.

కర్మను ప్రధానముగా గలది కర్మార్థకము.

౬౮. సకర్మకం బని, యకర్మకం బని, ప్రేరణార్థకం బనియు గర్త్రర్థప్రయోగంబు త్రివిధంబు.

కర్మ గలది సకర్మకము - కర్మ లేనిది యకర్మకము.

ప్రేరకుఁడు కర్తగాఁ గలది ప్రేరణార్థకము.

౬౯. స్వార్థకం బనియుఁ, బ్రేరణార్థకం బనియు, గర్మార్థంబు ద్వివిధంబు.

౭౦. కర్త్రర్థప్రయోగమునందుఁ గర్తృవాచకంబు ప్రథమాంతంబును గర్మవాచకంబు ద్వితీయాంతంబునుగా నుండును.

కర్మార్థకప్రయోగంబునఁ గర్తృవాచకంబు తృతీయాంతంబును గర్మవాచకంబు ప్రథమాంతంబునుగా నుండును.

ప్రేరణ కర్త్రర్థప్రయోగంబునఁ బ్రేరకవాచకమును బ్రయోజ్యవాచకంబునుగా రెండురెండు కర్తృవాచకంబులును గర్మయొక్కటియుం నుండును.

ఆజ్ఞాపించువాఁడు ప్రేరకుఁడు.

ఆజ్ఞాపింపఁబడువాఁడు ప్రయోజ్యుఁడు.

ప్రేరణకర్త్రర్థకప్రయోగంబునఁ బ్రేరణవాచకము ప్రథమాంతంబును, ప్రయోజ్యవాచకము తృతీయాంతంబును, కర్మవాచకము ద్వితీయాంతంబును నగు. కర్మార్థంబునం బ్రేరకవాచకంబును దృతీయాంతం బగు.

ఉదాహరణములు.

కర్త్రర్థకము. సకర్మకము.

ఈశ్వరుండు. లోకంబులను సృజియించెను.

అకర్మక కర్త్రర్థకము.

వాసుదేవుం డవతరించెను.

ప్రేరణకర్త్రర్థకము.

రాజు సైనికులచేత శత్రువులను సంహరింపించెను.

స్వార్థక కర్మార్థకము.

కాఁపులచేతఁ బొలములు దున్నఁబడెను.

ప్రేరణ కర్మార్థకము.

రాజుచేత - బంటులచేత శత్రువులు సంహరింపఁబడిరి.

సకర్మకమందాత్మనేపదార్థకంబును గలదు.

రాముఁడు - అన్నమును - వండుకొనియెను.

అకర్మకక్రియలయొక్క కర్త ప్రేరణయందుఁ గర్మ యగును.

బొమ్మలు - ఆడుచున్నవి.

సూత్రధారుఁడు - బొమ్మల నాడింపుచున్నాఁడు.

వాఁడు నవ్వుచున్నాఁడు.

వీఁడు వానిని నవ్వింపుచున్నాఁడు. ఇత్యాదులు.

ఇది క్రియాపరిచ్ఛేదము.

శ్రీ శ్రీ శ్రీ.

శ్రీ లఘువ్యాకరణము సంపూర్ణము.

---

చూ. బా. క్రి. ౧౧౨ - ౧౨౮ సూత్రములు.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1951.

# పద్యకావ్యములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అన్యవాదకోలాహలము, లఘుటీక | ... | 0 | 12 |
| అధ్యాత్మరామాయణము, పద్యకావ్యము | ... | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము | ... | 1 | 0 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 6 |
| ఆంధ్రభారతము, పద్యకావ్యము:— | | | |
| ఆది సభాపర్వములు | ... | 4 | 0 |
| ఆరణ్యపర్వము | ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు | ... | 4 | 0 |
| శాంతిపర్వము | ... | 4 | 0 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | | 4 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 11 | 8 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | 7 | 8 |
| శాంతిసప్తకము | ... | 7 | 8 |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | ... | 1 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము—శ్రీ జనమంచి శేషాద్రిశర్మ గారిది 3 సంపుటములు | ... | 15 | 0 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము, 2 సంపుటములు | ... | 15 | 0 |
| ఉత్తరరామాయణము, చక్కనికూర్పు | ... | 6 | 0 |
| కాశీఖండము | ... | 3 | 8 |
| కుమారసంభవము, నన్నెచోడకృతము | ... | 5 | 0 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | | 0 | 12 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము | ... | 1 | 12 |
| ఉత్తరహరివంశము | ... | 3 | 0 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది | ... | 1 | 8 |

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| చెన్నపురీవిలాసము | ... | 0 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 4 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | ... | 0 | 6 |
| ఆంధ్రనామసంగ్రహము, పద్యనిఘంటువు | ... | 0 | 3 |
| ,, టీకతో | ... | 0 | 10 |
| ,, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, వగైరా టీకతో | | 2 | 0 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 1 | 0 |
| కవిత్వతత్వవిచారవిమర్శనము | ... | 1 | 8 |
| కవిరాజమనోరంజనము | ... | 1 | 4 |
| కృష్ణదండకము | ... | 0 | 2 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 12 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 8 |
| డిటో గట్టుప్రభుకృతము | ... | 0 | 10 |
| గయోపాఖ్యానము, పద్యము, రామనామాత్యునిది | ... | 0 | 12 |
| డిటో ద్విపద, నాదిండ్ల గోపమంత్రి | ... | 0 | 8 |
| గద్యపద్యసంగ్రహము, జ. వే. సుబ్రహ్మణ్యశర్మగారిది. | ... | 0 | 12 |
| ,, గొర్తి సూర్యనారాయణశాస్త్రిగారిది | ... | 1 | 0 |
| గరుడాచలము-యక్షగానము, పెద్దచ్చు | ... | 0 | 3 |
| గీతమంజరి, చిలకమర్తి లక్ష్మీనరసింహము | ... | 0 | 4 |
| చెన్నబసవపురాణము | ... | 2 | 8 |
| జైమినీభారతము | ... | 2 | 8 |
| తెనుఁగుసమస్యలు | ... | 0 | 3 |
| దసరాపద్యములు | ... | 0 | 2 |
| దశావతారచరిత్ర, పద్యకావ్యము | ... | 4 | 0 |
| ధనాభిరామము ,, | ... | 0 | 12 |
| దేశింగురాజుకథ (జంగంకథ) | ... | 0 | 8 |
| ధ్రువోపాఖ్యానము, సటీక | ... | 0 | 10 |

# నిఘంటువులు

| ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|
| వావిళ్లనిఘంటువు 1 భాగము (అ మొదలు ఔ వఱకు) | 10 | 0 |
| ,, 2-వ సంపుటము ... | అచ్చు | |
| శబ్దార్థచంద్రిక, శ్రీమహాకాళి సుబ్బారాయకృత ఆంధ్రనిఘంటువు | 10 | 0 |
| లఘుశబ్దార్థచంద్రిక ,, ... | 6 | 0 |
| Sankaranarayana's English-Telugu Dictionary, శంకరనారాయణగారి నిఘంటువు (ఇంగ్లీషుపదములకు తెనుఁగు అర్థముగలది) ... | 15 | 0 |
| English-Telugu Pocket Dictionary ఇంగ్లీషు-తెనుఁగు పాకెట్టుడిక్షనరి ... | 5 | 0 |
| సంస్కృతాంధ్రనిఘంటువు (సంస్కృతపదములకు తెనుగు అర్థముగలది) | 3 | 8 |
| శ్రీవేంకటేశాంధ్రము, పద్యము ... | 0 | 6 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీక, అకారాద్యనుక్రమణికతో ... | 2 | 0 |
| బాలచంద్రోదయము, అలఘుకౌముది ... | 0 | 8 |
| నేటికాలపుకవిత్వము ... | 3 | 0 |
| తెనుగుసామెతలు with English Translation by Captain Carr ... | 2 | 0 |
| Translation Guide, English to Telugu & *Vice Versa* ... | 2 | 8 |
| సులక్షణసారము ... | 1 | 8 |
| ఆంధ్రశబ్దమంజరి, బు॥ సీతారామాచార్యులు ... | 0 | 8 |

## ఆంధ్రవ్యాకరణములు

| | | |
|---|---|---|
| ఆంధ్రభాషాభూషణము, పద్యవ్యాకరణము ... | 0 | 6 |
| ప్రౌఢవ్యాకరణము ... | 1 | 0 |
| డిటో బులుసు వేంకటరమణయ్యగారి టీకతో ... | 3 | 0 |
| వెంకయ్యవ్యాకరణము ... | 0 | 8 |

# ఆంధ్ర వ్యాకరణములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| బాలవ్యాకరణము, శ్రీ చిన్నయసూరిగారిది | ... | 1 | 4 |
| ,, విద్వాన్ బులుసు వేంకటరమణయ్యగారిలఘుటీకతో | | 2 | 8 |
| ,, శ్రీ దూశి రామమూర్తిశాస్త్రిగారి టీకతో | ... | 6 | 0 |
| ప్రశ్నోత్తరాంధ్రవ్యాకరణము శ్రీ పుదూరి సీతారామశాస్త్రికృతము | | 1 | 0 |
| పట్టాభిరామపండితీయము, శ్రీ వేదము పట్టాభిరామశాస్త్రిగారిది | | 1 | 0 |
| శ్రీ రావిపాటి గురుమూర్తిశాస్త్రి తెనుగువ్యాకరణము | ... | 1 | 0 |
| ఆంధ్రసంస్కృత వ్యాకరణము, వేదము సూర్యనారాయణశాస్త్రి | | 1 | 4 |
| అప్పకవీయము | ... | 5 | 0 |
| కవిజనాశ్రయము | ... | 1 | 0 |
| కవిగజాంకుశము | ... | 0 | 6 |
| కవిజనసంజీవని | ... | 0 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము | ... | 0 | 8 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము | ... | 2 | 0 |
| ఆనందరంగరాట్ఛందము | ... | 1 | 8 |
| వ్యాకరణసంగ్రహము | ... | 0 | 8 |
| బాలసరస్వతీయము | ... | 2 | 0 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక | ... | 0 | 12 |
| సర్వలక్షణసారసంగ్రహము | ... | అచ్చు... | |

---

| | | | |
|---|---|---|---|
| విశ్వకోశము, (విశ్వనిఘంటువు) సటీక | ... | 2 | |
| మేదినీకోశము ,, | ... | 4 | |
| హారావళి, ఏకాక్షరీకోశము ,, | ... | 1 | |
| అమరము 3 కాండలు, మూలము | ... | 1 | |
| అమరము, సటీక, మేలుకాగితములు, కాలికోబైండు | ... | 5 | |
| త్రికాండశేషము, సటీక | ... | 1 | 1 |
| ధనంజయనిఘంటువు, సటీక | ... | 1 | |
| నానార్థరత్నమాల ,, | ... | 2 | |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.